# బుద్ధిమతీవిలాసము



గ్రంథకర్త.

బలిజేపల్లి లక్ష్మీకాంతకవి



ప్రకాశకుడు:

కుదుకూరి సుబ్బారావు సన్

పబ్లిషర్ అండ్ బుక్‌సెల్లర్స్.

సరస్వతీ బుక్ డిపో.

విజయవాడ.

కాపీరైటు రిజిష్టర్డు

వెల 1-4-0

శ్రీ

# బుద్ధిమతీవిలాసము



(ఆఱంకముల నాటకము)

గ్రంథకర్త:

**బలిజేపల్లి లక్ష్మీకాంతము**

సత్యహరిశ్చంద్రీయ సాత్రాజితీయాది గ్రంథకర్త.



ప్రకటనకర్త:

**కురుకూర సుబ్బారావు సన్.**

కురుకూరి స్వరాజ్య వెంకట సత్యనారాయణరావు.

ప్రొప్రయిటరు:

శ్రీసరస్వతీ బుక్ డిపో, విజయవాడ,

5వ కూర్పు 1000 ప్రతులు

విజయవాడ శ్రీ సరస్వతీ ప్రెస్సునందు ముద్రింపబడియె.

**1949**

కాపీరైటు రిజిష్టరుడు]

[వెల రు. **1-4-0.**

—• ఈ నాటకమునవచ్చు పాత్రములు •—

పురుషులు

సిరియాళుడు—కథానాయకుడు
సుకలుడు—మంత్రి
నారదుడు—దేవర్షి
భద్రుడు—రాజసేవకుడు
పరమేశ్వరుడు—త్రిమూర్తులలో నొకడు
ముప్పురు—బ్రాహ్మణులు
భృంగిరిటుడు—శివదూత
యతి—మాయావేషధారియగు శివుడు
కంచుకి—రాజాంతఃపుర సేవకుడు
మతిమంతుడు—రాకుమారుడు

స్త్రీలు

★

బుద్ధిమతి—కథానాయిక
పార్వతి—పరమేశ్వరుని యిల్లాలు

——

# ప్రకటన

—:o:—

ఈ బుద్ధిమతీవిలాసము అను నాటకము మహారాజశ్రీ కురుకూరి సుబ్బారావుగారికి శాశ్వత కాపీరైటు యిచ్చినాను గనుక వారు ముద్రించుకొనుటకు నా అభ్యంతరమేమియున్ను లేదు.

Poluri Venkata Hanumantha Rao,
15-12-31.

☞ మా అనుమతి పొందనిదే ఈ నాటకము ప్రదర్శింపరాదు.



ఓమ్ శ్రీర్జయతు.

# బుద్ధిమతీవిలాసము



## నాంది

గంగను నుత్తమాంగమునఁ గన్గొని, యీర్ష వహించు శైలక
న్యం గరుణార్ద్రబుద్ధిగని, "యంబరకేశుఁడ గాన మచ్ఛిర
స్సంగతయయ్యె నానది నిసర్గముగా" నని బుజ్జగించి, య
ర్ధాంగ మొసంగివట్టి హరిణాంకధరుం డిడు మీకు భద్రముల్.

[నాంది యైనపిమ్మట సూత్రధారుఁడు]

సూత్ర—ఆహా! కాలము మీరినను నటి యింకను రాకున్నది. సింగా
రించుకొనుట యింకను బూర్తికాలేదు కాబోలు!

నటి—(ప్రవేశించి) ఆర్యపుత్రా! కోపము వలదు. ఇదే వచ్చితి.

సూత్ర—సఖి! భాగ్యవతివి కమ్ము.

చ. తలచినకార్య మార్యవినుతక్రమసిద్ధి నొనర్ప, లోఁ గుతూ
హాలపడి నిన్ దలంచు సమయంబునకే చనుదెంచినావు, నే
వలరితి నీదుభక్తికిఁ బ్రియా! ధర బుద్ధిమతీవిలాస మి
ట్టులె పతిచింతఁ దీర్పఁగఁ బటుప్రతిభాంచితవాక్యపద్ధతిన్.

నటి—ఏజైన నూతన నాటకప్రయోగముచేఁ బూజ్యులైన యీ సభా సదుల కానందముఁగూర్పవలయునని కదా మీకుతూహలము. ఆర్యపుత్రుల యభిప్రాయము శ్లాఘనీయమే కాని యది మనకు సాధ్యమా యని సందేహించెదను. ఏలయన?

గీ. క్షితిహితుల, గానసుకలానుకృతుల, శాస్త్ర
యుతుల, సువివేకమతుల, నూర్జితసుధర్మ
గతుల, వీరల మననాటకప్రయోగ
ఘనచమత్కృతి మెప్పింపఁగలదొ లేదొ.

సూత్ర—ఓసి ముద్దరాలా! మనసామాజికులు నాటకప్రయోగమున నిరుపమానవైదుషీవిశేషులును ననుభవశాలురునై యున్నారు గదా! అదియుంగాక పండితులమెప్పుం బడయుటకు మన వారెంతయుం బాటుపడుదురు. చూడు,

గీ. సుమతులగువారు తమ నాటకములఁ జూచి
మెచ్చునందాఁక నెంతయు హెచ్చరికను
పాటుపడుదురు మనవారు, ప్రాణములను
వర్పణముసేయువారు సద్యశముకొఱకు.

కావున నాటకము నిర్విఘ్నముగాఁ గొనసాగుట కేమియు సందేహము లేదు.

నటి—ఆర్యా! ప్రస్తుత మీ సభాసదుల కానందముం గూర్పఁగల నాటక మెయ్యది?

సూత్ర—బుద్ధిమతీవిలాసమె.

నటి—ఆ నాటకమును రచించినవా రెవరో నాకుఁ జెప్పకపోయితిరి.

సూత్ర—ఇప్పుడా గ్రంథకర్త నామాదులతో నేమియవసరము?

నటి—గ్రంథకర్తనామముం దెలుపకయే తత్కృత నాటకమును బ్రయోగించినచోఁ, గొందఱికిఁ దద్గుణాగుణవిమర్శమునందు సంకటము సంభవించునే. అది యెట్లు?

సూత్రి—గ్రంథకర్త పేరుంబట్టియా గ్రంథవిమర్శ మొనరించుట? అట్టివారే ద్వేషయుక్తులగు విమర్శకు లని నేఁ దలంచెదను. గ్రంథకర్త యెవఁడైన నేమి?

చ. పరకృతకావ్యమందున సుభావమునన్ గుణము గ్రహించి ద్వే
షరహితుఁడైన పండితుఁ డసద్గుణపంక్తి బరిత్యజించు, సా
గరమున గుల్లలన్ గలిసి గ్రాలెడు మేల్ రతనాలనే గ్రహిం
తురుగద నాచుగుల్ల లెడఁద్రోయుచు మానవుల్ జగంబునన్.

నటి—ఆర్యా! ఈ సభాసదులు కవిపేరు వినఁగోరియుందురు.

సూత్రి—అట్లయిన వినుము.

మ. వెలనాడ్బ్రాహ్మణముఖ్యుఁడున్ హారితసం విస్మారనిసద్గోత్రుఁడున్
బలిజేపల్లి నృసింహశర్మ సుతుఁ డప్పయ్యాఖ్య సత్పౌత్రుఁ డ
ర్మిలి సద్బోధ్యవిధేయ శీలుఁడగు లక్ష్మీకాంతుఁ డుద్యత్సతీ
తిలకం బాదెమ గన్న కాన్పు తగురీతిన్ చిన్ననాఁ డెట్టులో.

కం॥ హనుమ చ్ఛ్రీరాములచే
వనిశము బోధింపఁబడుచు నార్యులవినుతిన్
గను గుంటూర్పుర హిందూ
ఘననాటక సంఘమునకుఁగా రచియించెన్.

ఆ హిందూ నాటక సమాజము నేఁడు చెదరిపోయినందులకు చింతిల్లుచున్నాను.

ప్రేయసీ! ప్రసంగవశమునఁ గాలహరణ మగుచున్నది. నీవిఁక ఋతుగానము గావింపుము.

నటి—ఆర్యా! ఏ ఋతువును గురించి?

సూత్రి—వికసిత కుసుమ విసరపరిసరన్మకరంద రసాస్వాదనతుందిలా మిళింద సందోహఝుంకార బధిరీభూత దిగంతంబగు నీవసంత సమయంబును గూర్చియే గానము సేయుము.

నటి—అలాగునసే.

రాగము - ఖరహరప్రియ. తాళము - రూపకము

ఔర యీవసంతమాస ॥ఔర॥
అఖిలసుఖ సముల్లాస ॥ఔర॥
సారాభినవ కుసుమ సౌరభ విలాసభాస ॥ఔర॥
అలరు దేనె లాని యళుల
కులము మొఱయఁ గోకిలములు
తలిరు జొంపములను మేసి చెలఁగి కూయఁగా
తలిరుటాకుబాకుఁ బూని
వలపుఱేఁడు దాడివెడలె ॥ఔర॥

సూత్రి—భళీ! నీగానము.

గీ. రమ్యమగు నీదు కంఠస్వరంబు వినిన
వారు నారదు వీణారవం బటంచు
భ్రాంతిచేఁ జూచుచున్నారు పడఁతిమిన్న!
నారదుఁడె యిందువచ్చుచున్నాఁడొ యనుచు.

ఇఁక బోదముర మ్మిక. (నిష్క్రమింతురు.)

ఇది ప్రస్తావన.



ఓమ్ శ్రీర్జయతు.

# బుద్ధిమతీవిలాసము.

## ప్రథమాంకము

[పిమ్మట నారదుఁడు ప్రవేశించుచున్నాఁడు]

రాగము : కల్యాణి    తాళము : రూపకము

క్షీరసాగరశయనా! సర-సీరుహదళనయనా!
నారదవీణానులాపా-నంద రసోల్లాస శ్రీశ! ॥క్షీ॥
మాయామానుషకాయ! - మహితగుణనికాయ!
శ్రీయుతవక్షోనివేశ! చిన్మయప్రకాశ యీశ!
నీ - రజభ - వా - దిసుర - సే - వితపదకమలయుగ!
దీ - నజనభరణ కరుణ - మా - నితకరుణారసకలి!
తా! - నుపమవిమలహృదయ! జ్ఞా - నధనదాయీ!
శరదిందువ-దన! నిర్భయ - వరదాన! జగన్నిదాన.

ఈలాగునవీణాలాపప్రౌఢిమమ్మై గానలోలుండైన శ్రీహరింబాడుచు త్రిలోకసంచారం బొనరించుచుండు నాకింకను యుద్ధప్రియత్వము పోయినది కాదు. ఆహా! ప్రపంచంబున వీరవిహారము కంటె నానందకరంబగు రెండవక్రీడ లేదుకదా.

మ. రణభూమిన్ హతవీరకంఠబిలనిత్యద్రక్తకల్లోలినీ
ఘనకేళీరతఢాకినీనిచయవాక్సందర్భకోలాహలం
బును వింటిన్, గనుఁగొంటిభారతరణంబున్ మోదముం జెందితిన్
గనవైతిన్ గద నేఁ దదాది ఘనసంగ్రామంబుఁ దద్వైఖరిన్.

అక్కటా! ఉర్వీచక్రంబెల్ల నిర్వీర్యమై, యెందుఁజూచినను బిరికిపందలు జన్మించుచుండుటంజేసి, నాకు నాప్యాయనముగా రణభోజనము లభింపకున్నది. అప్పటికిని సహజమైన యుద్ధప్రియత్వము మాఱకుండుటవలన, నెచ్చటనేని సపత్నీవైరంబేనియుఁ గల్పించి, తన్మూలమున సంతసింపుచుందును. ఇప్పుడు లోకమాతయగు పార్వతీదేవి నా కాజ్ఞాపించిన ముదలమేఱకు భూలోకంబున నెక్కడనైన నిష్కల్మషశైవవ్రతాభిమానియు, సత్యసంధుండును నగు రాజశ్రేష్ఠుండును బత్యనుసరణవ్రతయగు వీరపతివ్రతయు నున్నదేమో వెదకి చూచుటకు నేనీ చోళదేశంబు ప్రవేశించితి. ఇక్కడిరాజగు సిరియాళుం డట్టివాఁడనియే వింటి. అతనియాస్థానంబునకే పోయెదను.

(నిష్క్రమించును) (ఇదివిష్కంభము.)

[పిమ్మట నుచితాసనంబుల నుపవిష్టులై, సిరియాలనృపాలుఁడును, సుకలుఁ డను మంత్రియుఁ బ్రవేశించుచున్నారు.]

సిరి—సుకలా! ప్రపంచంబునఁ గొఱంత యన్నది లేనివాఁ డెవ్వఁడును లేఁడుకదా! చూడు.

మ. ధనమే యుండిన విద్యసున్నయగు, విద్యాశ్రీలు రెండుండినన్
జనుజ్ఞానం, బదియున్ బొసంగినను దానం బుత్తదో, దానమున్
ధనమున్ విద్యయు జ్ఞానమున్ గలుగ సంతానంబు శూన్యంబు ప్ర
శ్నన సంతానమె యున్నచోఁ గలుగదింటన్ గూటికిన్ గుడ్డకున్.

సుకలా! సృష్టికర్తయగు పరమేష్ఠి సంకల్పమెట్టిదోకాని—

గీ. సుతులు సుతు లని వాపోవు సతులభాగ్య
వంతుల కొసంగఁదలపఁ డావనజభవుఁడు
పాడు పొట్టకునై పలువాట్లఁ బడెడు
బడుగు పేదలు వలదన్న మెడకుఁ జుట్టు.

సుకలు—దేవా! నే నొక్కటిచెప్పెదను. మీరు చక్కఁగా యోజింపుడు.

మ. తొలిజన్మంబునఁ జేసినట్టి సుకృతిస్తోమంబులం బట్టియే
కలుగుంగాని ఫలంబు లీభవమునన్ గాసంతయున్ హెచ్చుగా

వలెనన్నా నరకోటికిన్ గలుగునా భావింపఁగ న్డావుమే
రల వస్త్వాళియొకాక, కన్పడున సర్వం బేకదృష్టిన్ గనన్?

సిరి — సుకలా! నీవు వాస్తవము పల్కితివికాని నిక్కముగా సుతసంతా
నము లేని గృహస్థుని జన్మము నిరర్థకముకదా! అక్కటా!

మ. పరలోకంబున కేఁగుచుండి, తమతో వంశంబు పోకుండ నీ
సరికిన్ నిల్పిన వంశకర్తలకు నాశ ల్దీరుగా నింక నా
మరణాంతంబున నీళ్ళచుక్కలకునై మద్వంశ మీనాఁటి కం
కురహీనంబయి యస్తమించెను మహాఘోరంబు ప్రాప్తించుటన్.

సుకలా! నీరశైవ వ్రతాచార సంపన్నుండనై యతిథిపూజా
తత్పరుండనై యేకాగ్రబుద్ధి నాపరమేశ్వరుం బూజింపుచున్నను
నా కమ్మహానుభావుండు ప్రసన్నుండు కాకపోయె. నా వంశ
మీలాగు పుత్రసంతాన శూన్యంబై యంతరింపవలసినదిగా
విధివిధానము కలదు కాఁబోలు! ఏమిసేయుదు?

సుకలు — దేవా! దైవికంబునకు నెవ రేమి సేయంగలరు?

క. ఘనమా కొంచెమొ దైవము
తనకిచ్చిన యదియె ప్రాప్తధన మనుచు మదిన్
మనుజుం డూరట నెందన్
జనుగా కన్నిటికి బార సాచన్ గలడే?

(వినుట నభినయించి) దేవా! వీణారవం బెచ్చటనుండియో
వినవచ్చుచున్నది. (భద్రునివంకకు దిరిగి భద్రా! పోయి
కనుగొనిరమ్ము.

భద్రు — (పోయి మరల ప్రవేశించి)

గీ. హస్తమున వీణబూని మహాత్ముఁ డొకఁడు
వచ్చుచున్నాఁ డిదే యిటు సచ్చరిత్ర!
తాండవారంభ విలసనోద్దండుఁడైన
ఖండపరశువు చను దెంచుచుండినట్లు.

[నారదుఁడు ప్రవేశించుచున్నాఁడు]

సిరి — (ఎదురుగాఁ జని) మునీంద్రా! నమస్కరించుచున్నాను.

నారదు—పుత్రవంతుఁడవు కమ్ము.

సుకలు—దేవా! నావందనముల నందికొందు.

నార—ధీమంతుఁడవు కమ్ము.

సిరి—దేవా! ఈ మణిపీఠంబున విశ్రమింపుఁడు.

నార—(కూర్చుండి) రాజా! నీకును నీ ప్రజలకును సేమమా?

సిరి—మీ దయావిశేషమున.

నార—గీ. శాంతిధనుఁడవు నీవు రాజ్యంబుసేయ
జనులు మితిలేని సుఖములఁ దనరలేరె
భానుకరరశ్మి బాగుగాఁ బ్రబలుచుండ
పద్మవనములు వికసిల్లవా; నృపాల!

సిరియాళ! నీవు ధర్మగుణాంచితుండవై దేశంబు పరిపాలించుచుంటివని విని మేమెంతయు సంతసిల్లినారము. కావుననే నిన్నుఁ జూడవచ్చితిమి.

సిరి— బేహాగ్ రాగము—ఆదితాళము.

ధన్యుఁడనైతి మునితిలక నే ॥ధన్య॥
పావనమయ్యె మీ। పదరజమున గృహము।
దేవర! తొలఁగెను। నావృజినములు! ధీవరా! మానివరా!
వే వరా లొసగుము కరుణను ॥ధన్య॥

గీ. ఎంతపుణ్యంబు! నాభాగ్య మెంతకలదో
తాపసోత్తమ తావక దర్శనమున
నడఁగె మామక పాపచయంబులెల్ల
నంశుమంతునిచేఁ దమం బడఁగినట్లు.

భద్రా! దేవిగారిం బిలుచుకొని బంగారపు భృంగారుపుతో విమల సలిలంబులం గొనిరమ్ము.

భద్ర—చిత్తము. (తిరిగిదేవితోఁ బ్రవేశించును) అమ్మా! యితా గీలాగు,

బుద్ధి—దేవా! నానమస్కృతులు గైకొనుండు.

నార—వంశపవిత్రుని బుత్రునిం గనుము.

సిరి——మునీంద్రా! పాదప్రక్షాళనం బాచరించెద. మీ పాదపద్మములు
నిటు సేంచుడు.

నార——రాజా! మావంటి మునీశ్వరుల యందు నీకుంగల భక్తి విశ్వాస
ములు లోక ప్రఖ్యాతములే.

బుద్ధి——(జలంబులకై బోయును).

సిరి——(పాదములం గడిగి తజ్జలంబు మూర్ధమునం జల్లుకొని,)

మ. అనఘా! మామకపూర్వజన్మకృతపుణ్యాంబెంత వర్ధిల్లెఁ బ్రా
పినుకుం బల్లవపాణి తొల్త నిశికూర్మికై జోలలంబాడి యూ
చిన చిన్నారి కుమారు మిమ్ముఁగని, మీ శ్రీపాదతోయంబు లే
నునుపం గల్గితి నాశిరంబునఁ గృపాళూ! భాగ్య మిట్లొప్పునే?

నార——రాజా! నీ భక్తికి సంతసించితి. చిరకాలము నుండియు నీ
వాచరించుచుండిన నీ వీరశైవవ్రతము నిర్విఘ్నంబుగాఁ గొన
సాగుచున్నది కదా.

సిరి——దేవా! ఇంతవరకు.

నార——రాజేంద్రా! నీవు ధన్యుండవు. బుద్ధిమతీ! నీ విల్లాండ్రలో కెల్ల
బరమపుణ్యవు.

గీ. తరుణి! నిక్కంపు సాధ్వీమతల్లివమ్మ
సుగుణవతివమ్మ నీకు నీ శుద్ధవృత్తు
లలవడెను జన్మమాదిగా నలరుతోడ
పరిమళంబు జనించిన భంగిగాఁగ.

బుద్ధి దేవా! అవ్విగాము లెఱుఁగని నేను మీయట్టిపొగడ్తలకుఁదగను.

నార——బుద్ధిమతీ! అట్లనకు. నీ వినయాదిగుణములు నీ సతీత్వమునకు
వన్నె దెచ్చుచున్నవి. మీ దంపతు లిరువు రాచరించుచుండిన
వీరశైవవ్రతము సిద్ధించి శీఘ్రకాలములోనే మీరు పుత్రవంతు
లవుదురు. ఇది పరమేశ్వరుని నియమమే.

సిరి —— గీ. మునికుల పవిత్ర! లోకపావన చరిత్ర!
తావకాశీర్వచనములు దప్పఁ గలవె?

తలఁగునే చందమునకు జల్లదన మొకింత
సుధ కోకష్టంబు కొఱఁత యె మధురిమంబు.

నార—రాజేంద్రా! నీవు శివభక్తాగ్రేసరుండవు. సకలార్థంబు లొసంగుటకు శివభక్తి యరచేతి చింతామణి కదా!

సీ. కామాదిమదవైరి కర్తనంబున కిల
శివభక్తి శాతకౌక్షేయకంబు
సకల కామిత వస్తుసంధానమునకు నా
ఫాలాక్షు భక్తి కల్పద్రుమంబు
వితత పాతకభూమి భృత్పాటనకిఁ యు
శభవునిభక్తి వజ్రాయుధంబు
మాయావిరచిత సంసారాగ్నిఁ జల్లార్ప
కౌమారిభక్తి యఖండవృష్టి
గీ. అమితదుఃఖంబు లనెడు సర్పములకెల్ల
నీలకంఠునిభక్తియే నీలకంఠ
ముఖలరోగ భయాది సంగతులకెల్ల
వామదేవుని భక్తి శ్రీరామరక్ష.

కావున రాజా యెట్టి యిక్కట్టులు తటస్థించినను నీవు పూనిన వీరశైవవ్రతంబును మానకుము. సత్యవ్రతమును, జక్కగా బరిపాలింపుము. నీ భార్యయును నీ వ్రతమును నిర్విఘ్నముగా నెఱవేర్చుచుండు పరమ పతివ్రతాశిరోమణి. ప్రపంచంబున నుత్తమసతీగుణంబు లిట్లుకదా యుండవలయు, చూడుము.

చ. పతిమదిఁ జింత చేకుఱినపట్టునఁ దత్సమయోచితంబుగా
హితములు పల్కి ధైర్యమువహింపఁగఁ జేయఁగఁజూచునట్టి యా
సతి కగు సాధ్వినామము విచారమగ్నమనస్కుఁడై న యా
పతికడఁ జేరి మూర్ఖపువివాదములాడెడు దాగ మృత్యు దే
వతయగుగాని యా మగనిపాలిటికిఁ దగు భార్య యెట్లగుఁ ?

రాజా! ఈ బుద్ధిమతీసహాయమున నీ కీర్తి దిగంతవిశ్రాంతమై వెలయుచుండు నృపకులతిలకా! నీవు పుత్రవంతుఁడవై సుఖముగా నుండవలయునని మాకోరిక గాన నింత వచించితి.

ఓరి—దేవా! నేను మీచేఁ జక్కఁగా ననుగ్రహింపఁబడితిని.

గీ. మాకునయి మీకు గోరిక మతి జనింప
ఫలమువెంటనె మాకు సంప్రాప్తమగును
ధర సకాలంబునకు వాన కురియుచుండ
పంట లేటికి బాగుగాఁ బండకుండు.

దేవర్షితిలకా! ఇంక రాజ్యాంగ విషయికమైన నీతులం బోధించి నన్ను ధన్యునిఁ జేయవలయు.

నారద—నృపచూడామణీ! ధర్మప్రభుండవైన నీ వెఱుంగని రాజ్యాంగ నీతు లేమున్నవి? అయినను నన్నడిగితివి గాన వినుము.

సీ. కన్నబిడ్డలపోల్కి గాపాడుదువు గాని
ప్రజలతో మిత్రితఁ బాయవలదు
ధనకోశమును నింపఁ దలఁచి నీ ప్రజలపై
లేని పన్నులను గల్పింపవలదు
ఆదాయమునుబట్టి వ్యయము చేయుదుగాని
భోగంబులను విజ్జి వీగవలదు
తెగియించి కన్నెలఁ దెగనమ్ము చెనఁటుల
వెదకి దండింపక విడుపవలదు

గీ. రాజ్యభరమెల్ల మంత్రివర్గంబుమీఁద
నునిచి సోమరివయి కూర్చుచుంట వలదు
మొగమెదుట నిచ్చకములాడు మోసగాండ్రఁ
దెలిసికొని విశ్వసించి వర్తింపవలదు.

నృపకులమణీ! ఇట్లు వర్తించితివా నీ సుగుణసంపత్తియు నీరాజ్యభారవహన క్రమంబును ప్రపంచంబున కెల్ల నాదర్శక ప్రాయంబులై యుండు.

సిరి—మునిశిరోమణీ! మీ సుబోధనామృత సేచనంబున నా చిత్తము
జ్ఞానాంకురము మొలకెత్తినది. నేను నిక్కముగా ధన్యుడనైతి.

నార—రాజేంద్రా! నీకు శుభమగుగాక. బుద్ధిమతీ! నీవు కోలంది
కాలములోనే పుత్రవతి వగుదువు గాక. మఱియు,

మ. ధరణీపాలక! నీ తనూజుఁడు మహాధర్మాత్ముఁడై వేదశా
స్త్రరహస్యార్థ సుధారసార్ద్ర హృదయాంచత్కీరరూపాఢ్యుఁడై
పరసేనామథనైక బాహుబల సంపద్యుక్తుఁడై, మాన్యుఁడై
యురుకీర్తిస్ఫురితాత్ముఁడై చిరతరాయుష్మంతుఁడై వర్ధిలున్.

సిరి—భాగ్యము.

నార—రాజా! మేమిఁక పోయివత్తుము

సిరి—మునీంద్రా! నమస్కరించుచున్నాను.

బుద్ధి—దేవా! నమస్కరించుచున్నదాన.

నార—సుపుత్రప్రాప్తిరస్తు. (నిష్క్రమించును.)

సిరి—దేవీ! మనము నేడు నిక్కముగా ధన్యులమైతిమి. ఈ మహాను
భావుని వచనంబుల కన్యథాత్వ మేల జరుగును?

బుద్ధి—నాథా! ఈ దేవర్షితిలకుండు త్రికాలవేది కదా!

సిరి—దేవీ! ఇంకేల సందియము?

ఉ. కోరినకోర్కి యింక సమకూరు మునీశ్వరు మాటరిత్తగా
నేరునె? నిశ్చయంబుగఁ బునీతులమైతిమి, నిల్చె నాకులం
బారజనీశ మౌళివిమలాంఘ్రి సరోరుహభక్తిగల్గు న
వ్వారికిఁ జేరకుండునె యవారణగా సకలేప్సితార్థముల్
దేవీ! ఇంక దేవపూజ వేళయైనది పోదము పద.

(అందఱు నిష్క్రమింతురు.)

ప్రథమాంకము

---



ఓమ్ శ్రీర్జయతు.

# బుద్ధిమతీ విలాసము

## ద్వితీయాంకము

రంగము : రాజమార్గము.

[పిమ్మట పాపంభొట్లు, నీలకంఠసోమయాజులు, వెంకావధానులు ప్రవేశించుచున్నారు]

ఫార్సీవర్ణమెట్టు – త్రిశ్రగతి

ఎంతభాగ్య మెంతపుణ్య మెంతటి పదవి!
వేలిగోదానాలు వే వేల భూదానాలు వ!
జ్రాలకుండనాలు, రత్నాలయుంగరాలు!
మాపాలు, మాపాలు॥ ఎంత॥

పట్టుపచ్చడాలు హుం జట్టుశాలువాలు!
చుట్టు జరీడాలు, కెం బట్టుశెల్లాలు!
మాపాలు, మాపాలు॥ ఎంత॥

నీల— వోయీ, పాపం భొట్లుగారూ! వేయేండ్లకు మన ప్రభువు సిరిసూ లుండు పుత్రపౌత్రాభివృద్ధిగా వర్ధిల్లవలెనోయీ.

పాపం— నీలకంఠ సోమయాజులుగారూ! ఆ మహారాజు యింకా యీ లాగే పదిమంది కొడుకులను కంటే మనము బంగారు గోడలను పెట్టుదుమయ్యా. వెంకావధానులుగారూ! కుఱ్ఱవాని నామ కరణ మేమని? నాకు మఱపు తగిలింది.

వెంకా—వల్లకాదు, నీబహువ్రతుల సంతోషంతోనే నీకు మతిపోయింది. కుబ్జావాని నామకరణం నీకేం జ్ఞాపకంవుండేమస్తుంది. మతి మంతుండపు, పేరుకూడా బాగానే కుదిరింది.

పాపం—పేరుకేం నిక్షేపంవంటిపేరు. కాని ఆలాటి భోజనం మనం జన్మానా భోంచేశాంపయ్యా? ఆ లడ్వాలేమి ఆ పోళీలేమి ఆ చిత్రాన్నాలేమి ఆ నెయ్యి వడ్డించడమేమి? తలచుకుంటే నా కిప్పుడు నోరూరుతూ వుంటేనూ.

నీల—ఆయనకేం మహారాజు. వెంకావధానులూ! నీవు ఆశీర్వచన పనసలు మహాధాటీగా చెప్పావే!

పాపం—చెప్పకేం. ఈ మధ్య దేశంగాని దేశానికి పోయి పీనుగులు మోసి డబ్బు సంపాదించడం మరిగాడుగాని క్రమాంతం అధ్యయనం స్వచ్ఛంగా చెప్పకున్నవాడే వెంకావధానులు.

వెంకా—ఓరీ! నీ యిల్లు వల్లకాదుగాను. నీవుటా్రి నన్నాక్షేపించేది. ఇక్కడికి ముగ్గురి కుమార్తెలమీద మూడువేలు పుచ్చుకొని వడ్డీకి వేసి కండ నమ్ముకొని జీవించు కసాయిముండాకొడుకువు. నీపెండ్లాము నీకు తగినట్లే దొరికినది. ఆడపిల్లలను తప్ప మొగ ముండాకొడుకును కననే కనదు. నీ పంట పండినది.

నీల—పాపంభొట్లూ! ఎందుకోయి నీకింత దుడుకు? వెంకావధానులు యెంతైన క్రమాంత స్వాధ్యాయపరుఁడు. నిరక్షరకుక్షికి నీ కేమి వచ్చు?

పాప—నా కేమి రాదుగా! నేను షోడశకర్మాధికారిని. నాతోపాటు అపరం చేసేవాణ్ణి చూపించు. నీవ్వారికే అందరిని యెత్తిపొడు స్తావుగాని నీసోమయాజితనము యెవఁడెరుగఁడు? యేనాఁడు యింట్లో అగ్నిహోత్రాలు లేవుకదా. ఈమధ్య నీవు కోమటి పాపిశెట్టిదగ్గర పిల్లిదానం పట్టినమాట నాకు తెలియకపోలేదు.

సీల—ఓరి నీ కడుపుడక ! వూరుకోరా నీపుణ్యాం ఈలాటి దురాచారాలు మన రాజుగారికి బొత్తుగా సరిపడవు. తెలిసిందా మనను కొఱత వేయించక మానఁడు.

పాపం—అల్లాఅని వూరుకో. మనము అంతా యేకకట్టుగావుండి, వకరిని వకరాక్షేపించుకోకుండా యేదో యొకతీరుగా డబ్బు సంపాదించు కుందాము. డబ్బు సంపాదించడములో అభిమానం యేడిస్తే అవు తుంది? మనము పోదాము రండి. (నిష్క్రమింతురు.)

(ఇది విష్కంభము.)

రంగము : కైలాసము.

[పిమ్మటఁ బార్వతియు నారదుఁడును ప్రవేశించుచున్నారు.]

నార—(పార్వతిం జూచి స్వగతము) వచ్చినతోడనే నాకీ లోకమాత కాన్పించుట నా కార్యమునకొక శుభసూచకమే. మాతు శ్రీపార్వతీ! లోకమాతా! నారదుఁడు నమస్కరింపు చున్నాఁడు.

రాగము - ధన్యాసి ఆదితాళము

కోరి నీపదసారసయుగమును, సారెకుఁదలచెదను ఓజననీ ॥కోరి॥
నీకరుణామృత సేకమునను సాకనగును జగదేకపావనీ
లోకమాతా! కరుణా సమేతా॥ అంబ త్రిలోక॥
కళాకలితా! లలితా! హిమాచలసుతా! రాకాసుధాకరచారువదనా!
పాకారి సురాళినుతగుణసదనా! శ్రీకర శుభంకరీ శాంకరీ
నీ కరుణకే వలచి నే గొలువ॥ కోరి నీపద సారసయుగమును॥

పార్వ—నారదా! అభీష్టసిద్ధి రస్తు.

నార—(స్వగతము) కలహాభీష్టసిద్ధి రస్తు అని యనుము.

పార్వ—వత్సా! నేఁడు భూలోకమునకేనా నీ వేగినది!

నార—అమ్మా! అక్కడికే.

పార్వ—అచ్చట నెచ్చటనైన నే నిదివరకు నిన్నడిగిన శివభక్తి పరా యణులగు పుణ్యదంపతులఁ జూచితివా?

నార—అమ్మా! నేఁ డొక మహాద్భుతవిషయమును మీకు కెఱింగింప వచ్చితిని.

పార్వ—నారదా! అంతటి యాశ్చర్యదాయక మగు విషయమా?

నార—అత్యాశ్చర్యము అతివిస్మయము.

పార—అట్లయిన నా విషయమును సావధానముగా వినవలసినదే చెప్పుము.

నార—అమ్మా! నా పూర్వభవార్జిత పుణ్యవిశేషంబుననే చోళదేశంబున వీరశైనవ్రతాచార పరాయణులగు పుణ్యదంపతుల దర్శించితి. అందున నా పతివ్రత గుణశీలంబు లనన్యసామాన్యంబులని నాకుం దోచుచున్నది.

పార్వ—నారదా! అంతటి నిశ్చల భక్తులును నంతటి వీరపతివ్రతయు భూలోకంబున నుండెగా! తచ్చరితం బాద్యంతం బెఱింగింపుము.

నార—అమ్మా! అవశిష్ట మేమిగాని యింతదనుక బతివ్రతాత్వ మహిమాతిశయంబున మిము మించెడికాంత త్రిలోకముల నుండదని తలంచితి. అకటా నేటికి మీ కీర్తి నలువు గాఞింప నొక్క మానవాంగన వెలసెఁ గదా!

పార్వ—ఏమి నారదా! ఆ నారీమణి మ మ్మపహసించునంతటిదిగా! ఇది నిక్కముగా నతిశయోక్తియే.

నార—హైమవతీ! నే నెప్పుడు లేనివిషయముల నిదమిత్థమని వాదింపను. నేను మీ భక్తకోటిలోనివాఁడనే కనుక మీ కీ వృత్తాంత మెఱింగింపవచ్చితి. అమ్మా! మీకుం గోపమువచ్చిన నేమాటాడఁజాలనుగాని నిక్కముగాఁ ద్రిమూర్తులందారలగు నాదిశక్తులు మీరు ముప్వురును నా నారీమణి కాలిగోరునకైన సమము కానేర రనినను నతిశయోక్తి కానేరదు. మీ కాగ్రహంబున కవకాశము లేదు. ఆ పతివ్రతాశిరోమణి విభుండును మూర్తీభవించిన సత్యశీలాది గుణగణంబు.

పార్వ—అట్లయిన వారి నామధేయాదుల నెఱింగింపుము.

—తల్లీ వినుము. భూమండలంబున కెల్ల నాయకమణి యనందగి, సకలార్థంబుల వెల్లిగొల్పఁ గల్పకవల్లియై, సజ్జనులకుఁ బుట్టి నిల్లయి, చోళదేశంబు కడుంగడు నలరారుచుండు. అందు సత్యమునకు జన్మస్థానమనందగి, నిరంతరదానైక నిష్ఠాగరిష్ఠతచే నల శిబి కర్ణ దధీచుల మఱపించి, శివభక్తి పరాయణతచే నపర మార్కండేయుం డనంబరగి, నిజాశ్రిత ప్రజరక్షాపరుండై సత్యవచోధురంధరుండై, హరిశ్చంద్ర వసుంధరారమణునిభంగి నిజ యశశ్చంద్రికలచేతను, బ్రతాపాతపంబులచేతను జంద్ర సూర్యుల విధంబునఁ బ్రకాశింపుచు శిష్టజనపరిపాలుండై, దుష్ట జన నిగ్రహుండై సిరియాళుం డను నృపాలుండు పరిపాలించు చుండు. ఆభూపాలశేఖరుని లోచనంబులు పరనారీముఖ చంద్రాలోకంబున ముకుళీభావము జెందుటచే సరసీరుహంబు లని నొక్కి వక్కాణింపనగు, ఆధారుణీశుని రమణీయాననంబు యాచకచకోరంబులకు నిరంతరామోద మాపాదించుటచే శరద్రాకాసుధాకరబింబం బనిన నతిశయోక్తి కాదు. పలుమాట లేల? ఆ చక్రవర్తి దివ్యతేజోమూర్తి సకలధర్మస్ఫూర్తియే. అమ్మహాత్ముని సద్గుణంబు లహోరాత్రంబులు వర్ణించినను దఱుగక భారతభాగవతంబులై పెరుఁగు. నే నెంతయని వర్ణింతు? ఆ రాజేంద్రుఁడు,

నిరతంబు చంద్రశేఖరుఁ దలంచునుగాని
పరచింతలను బ్రొద్దుజరుపఁబోఁడు
ప్రజల నందఱి నొక్కభంగిఁ జూచునుగాని
తనవార లని ప్రేమ దలఁపఁబోఁడు
నిద్రనైనను సత్యనియతినుండునుగాని
కలనైన ననృతంబుఁ బలుకఁ డెపుడు
శరణన్నవాని రక్షణముఁ జేయునుగాని
భీరువును జంపఁగోర డెపుడు

గీ. సజ్జనస్నేహములు సల్పుఁ జనునుగాని
యాతతాయులఁ గూడంగ నరుగఁ డెపుడు
చేతనయినంత మేలు నే జేయుగాని
పరుల కొంపలు దీయంగ బాలుపడఁడు.

ఆ మహానుభావున కెక్కడి ధర్మగుణమొ కాని.-

గీ. శైశవమునందుఁ దన పాఠశాలలోన
లపలవర్ణ క్రమంబులఁ జదువువేళ
వచ్చియుండిననోట రావచ్చుగాని
లేదనెడుమాట యితనికి రాదు గౌరి!

పార్వ—ఎక్కడనైనను సజ్జను లుండకూడదా! తరువాత.
నార—అమ్మా!

ఉ. ఆతనిభార్య బుద్ధిమతి యన్ దరుణీమణి సర్వసద్గుణ
వ్రాతసమేత, భర్తృపదభక్తిని రూఢమనోంబుజాత, సా
ధ్వీతిలకంబు, సంతత సుధీజన పాదసమర్చనైక సు
జ్ఞాత, పరోపకార కరణక్రియ సత్కరుణాసమేతయౌ.

ఆ పతివ్రతా శిరోమణికి బుద్ధిమతి యని పేరిడుటయందుఁ దజ్జననీజనకు లించుకయయినఁ బొరపాటుపడలేదు. అల విధాత సద్గుణంబుల సారంబెల్ల గ్రహించి బుద్ధిమతి యను సతీమణిని సృజించి యుండునేమో యని తలంతు ఆ నారీమణిని వర్ణింప శేషునకు వేయినోళ్ళు చాలవు. మరియు,

సీ. రమణీమణి కలంకరహితయౌట కుటిగింప
జిగిమించు నాపె నెమ్మొగమె సాక్షి
ఇభరాజగమన సువృత్తప్రథితయౌట
పసమీరు తత్కుచద్వయమె సాక్షి
నాళీకనయన సన్మార్గ సంస్థితయౌట నగజాత!
యాపె నెన్నడుము సాక్షి
పతి క్షమాగుణ సమంచితయౌట జాటింప
లాలిత కటిమండలంబె సాక్షి

గీ. వనిత లోకైక వినుత సద్గుణ కలాప
గా నొనర్చి తదీయాంగకముల చక్క
దనము సార్థక పఱచి మోదంబు గూర్చు
ధాత చతురత వర్ణనాతీతముగద!

మరియుఁ బ్రతివ్రత యన నామెయొకాక మీ రెట్లు పతి
వ్రతయను శబ్దంబు సరియగు? అమ్మా! నావచంబులకు శాంతి
వహింపవలసిన సమయమిదియే. ఆయమ సద్గుణంబులు స్వాను
భవమునఁ దెలిసికొనుటచే నుద్భవించిన వెల్లుసంతసంబున
నా నోటివెంట నొక వేళ మి మ్మధిక్షేపించు వాక్యములు వచ్చి
నను వానిని మీరు పాటింపకుందురు గాక! ఆ నారీమణి మహి
మంబులఁ గనినది మొదలు పతివ్రత యను శబ్దంబు మీకుం
దగదనియే నా యభిప్రాయము ఎట్లయినను నాదిశక్తివైన నీ
యెడల గౌరవభావ ముంచఁదగినదే కాని మి మ్మధిక్షేపింప
రాదు. అమ్మా! మీకుఁ గోపమురాదుకదా! నేను మొదట
నుండియు క్షమాపణములే కోరుచున్నాను గాన నాపై మీకుఁ
గానంతరమైన నాగ్రహంబున కవకాశము లేదు. మీ మీ పతి
వ్రతాత్వమహిమంబులఁ గుఱించి నిష్పక్షపాత హృదయమున
మీరే యాలోచింపుడు.

సీ. పొరుగిండ్లఁ బెత్తనా ల్జరుపుచు, ధవుని వ
క్షము నెక్కి లచ్చి యేసాధ్వియిన్న
గయ్యాళియై నాథుకంఠంబు నొత్తుచు
వాగెడివాణి యే పడఁతియిన్న
మగఁ డుండఁగా మాఱుమగనిఁ జేపట్టి బి
డ్డలఁగన్న గంగ యేకలికియిన్న
మగని దేహములోన సగము గైకొనిన నీ
వేలాటి దొడ్డ యిల్లాలివైతి

గీ. మగల వీరెల్ల గీలుబొమ్మలుగఁ జేసి
యాటలాడించుచును మరుమాటలాడ

వార్ధిఁబడఁ జొవ్వ నొక్కతె, వదరు నొకతె
చీలిపోయెను నొక్కతె, సింగ మెక్క
చంపివా నీవు నొక్కతె సాధ్వీమణులె?

పార్వ—(స్వగతము) ఆహా! ఈతఁడు మమ్ము బాగుగా నధిక్షేపించు చున్నాఁడు. ఈతఁ డెప్పుడును గలహప్రియుఁడు గదా! ఇతని మాట లెంతవరకు నమ్మనగునో కనుఁగొనియెదఁ గాక. (ప్రకాశముగా) నారదా! ఏమని యెదవు?

నార—అమ్మా! కోపమా? వలదు. నీ భక్తాగ్రేసరుండ నగు నాపై నీ కేల కోపము? ఉన్నవిషయమునే నేను వక్కాణించు చున్నానుగాని వేఱుగాదు. నే నెప్పుడు ఖడ్గవాదిని అందుచేత నా తొందరమాటలకు మీరును తొందరపడవలదు. ఖండితముగా మాటలాడువారి కందఱు విరోధులగుట సహజమే.

పార్వ—నారదా! నీపై నా కేమియుఁ గోపము లేదు. ఆ నారీమణి పతిభక్తి యెంతయుండునో పరీక్షింతుఁ గాక.

నార—అమ్మా! నిశ్చయముగాఁ బరీక్షింపవలనదే. నీకు నీ నాథుండును దోడ్పడ గలఁడు.

భృంగి—అమ్మా! నాయనగారు ప్రవేశించుచున్నారు.

పర—(నారదునిఁ జూచి) నేఁడు నారదుఁ డిచ్చటికి రాగతమేమో? ఏదియో కలహాపేక్షచేతనే వచ్చియుండును.

నార—శంకరా! నమస్కారము.

పర—సుఫలప్రాప్తిరస్తు.

పార్వ—నాథా! నమస్కరించెద.

పర—చింతితార్థసిద్ధిరస్తు (నారదుం జూచి) నారదా! నేఁ డిటు వచ్చితివి?

నార—దేవర దర్శనార్థంబుగాక మరి యేటికి?

పర—మీ రేదియో సంభాషించుచున్నట్లున్నారు?

నార—బుద్ధిమతీ సతీమణి విషయమై ప్రసంగించుచుంటిమి. ఇంకే మున్నది? సజ్జనకీర్తన లెప్పటికిఁ బుణ్యదము లేక దా.

పర—నారదా! బుద్ధిమతి యంతటి ధన్యాత్మురాలుగా? నీ వెప్పుడు గోరంతలు కొండంతలు చేసి చెప్పుచుందువు.

నార—ఏమి శంకరా! నా కీయెడ నబద్ధమాడు నవసరం బేమి? నే నెప్పుడు నిప్పుడుపాతహృదయంబున నిజముకాని వక్కాణింపను. మరియు లోక వృత్తాంత మెఱింగింపు మని యడిగినచో నబద్ధ మేలయాడవలెను? ఇన్నాళ్లు ఘోరతపం బాచరించి, మహానుభావుండ వగు నీ కరుణకుం బాత్రుండనై, దేవర్షి యను దొడ్డపేరు వహించి, ఇంకను నబద్ధమాడునంతటి పాతి కంబున కొడిగట్టవలెనా? నా తల్లుల నేనే హీనోక్తులాడ వలసి వచ్చినందులకు సిగ్గుపడుచున్నాఁడగాని నిక్కముగా రమా గౌరీవాణు లాబుద్ధిమతి కెందునుబోలరు. జగజ్జనుల హీనోక్తులం బలుకు నాపాపము క్షమింపఁబడుగాక, మహాదేవా!

సీ. మహితగుణవతి నాబుద్ధిమతిఁ దలంచు
నతఁడు మితిలేని పుణ్యసంగతుఁడు గాఁడె
తద్సతీమణి నామామృతంబు సుర్వో
యఘము లను రోగములకెల్ల నౌషధంబు.

ఆ సాధ్వీమణి నాథుండు సిరియాళుండు. అతండు సత్యవ్రత నైజాపరుండు. వీరశైవవ్రత పరాయణుండు. అట్టి పుణ్యదంపతు లీ రేడులోకంబుల లేరనుమాట నిక్కము, నిస్సందేహము, నిర్ధారణము, నిర్వివాదము. ఆహా! మాటలసందడి కాలంబుఁ దెలియనైతి. దేవా! దేవీ! నే నింక పోయివత్తు.

పర—నారదా! పోయి రమ్ము! నీవుబహుకార్యము లున్నవాఁడవు.

నార—(స్వగతము) ఇక్కడి కిది యొక్కటి యైనదికదా. (కొంత దూరము పోయి తిరిగి వచ్చి)

ఓ హిమాచలతనయా! తెలుపవలసినవాఁడను గనుక నింత తెలిపితి. ఇంక మన మాబుద్ధిమతీ ప్రభావమును నాసిరియాళుని భక్తి తాత్పర్యంబు లెట్టివో పరీక్షించి తీరవలయు. ఈవిషయమై మన మశ్రద్ధతో నుండగిట్టదు.

పార్వ—నారదా! నా కన్నియుం దెలియును, పోయిరమ్ము.

నార—(పోవుచు) ఈ పార్వతికి బాగుగా గోప మెక్కించితిని. ఈ వినోదముఁ గన్నారఁ గాంతును. (నిష్క్రమించును.)

పార్వ—నాథా! వింటిరా నారదుని పలుకులు!

పర—విన్నాను. నారదుఁడు కలహప్రియుండుకదా!

పార్వ—మమ్ము బాత్తుగా నధిక్షేపించినాఁడు.

పర—నెచ్చెలీ! నీ వనిత లెక్కసేయరాదు చూఁడు.

గీ. హైమవతి! నిన్ను నారదుఁ డాడినట్టి
పల్కులకుఁ దగ్గునే నీదు వాసి సుంత
ఈసునను దుమ్ముచేఁ జల్లమాసిపోనె
ప్రాబలుకు లెంకి వెలుగుల పస యొకింత.

పార్వ—నాథా! ఆతని పల్కులకు నాకేమియు నలుకగలుగదుగాని, యా దంపతుల దృఢభక్తి యెంతయుండునో పరీక్షింప నాకుఁ గుతూహల మగుచున్నది. నా కౌతూహలము మీ రెట్లుదీర్చెదరో?

పర—దేవీ! స్వలాభమైన గణింపక త్వదీప్సితార్థంబు నే నెప్పుడు దీర్పకుంటిని చూడుము.

గీ. నీదు సవతిని శిరమున నిల్పితి నని
ఘనసపత్నీర్ష్యచే నీవు కనలియుండ
స్త్రీసముఁడ నని నన్నాలి! యనంగ
నోర్చి నీ కర్ధదేహంబు నొసఁగలేదె.

కావున వెంటనే నీ మనోభీష్టంబు నెఱవేర్చెద. ఆ రాజ దంపతులఁ బరీక్షించెద. నా పరీక్షల కించుకయైనఁ జలింపక నిల్చిరేని వారికీర్తి ప్రపంచంబున వ్యాపించు. లోకులకు నుత్తమ నీతియు వెల్లడియగును. నే నీ విషయమున నీబాగుఁ బ్రవర్తించెద. (చెవిలో నేదియో చెప్పును.) మన మింకఁ బోదము పద.

[నిష్క్రమింతురు.] ఇది ద్వితీయాంకము.

---

ఓమ్ శ్రీర్జయతు.

# బుద్ధిమతీవిలాసము



## తృతీయాంకము

రంగము : రాజమార్గము.

[ అతిథులకై వెదకుచు సిరియాలుండు ప్రవేశించుచున్నాఁడు ]

(విచారముతో) ఆహా! ఏమి చోద్యము! దేశంబబ్రాహ్మణమైనట్లున్నది.

మ. పరికింపన్ వసియింతు రీనాగవనిలో బ్రాహ్మణ్యులౌ బ్రాహ్మణుల్
హరపాదద్వయసమ్మిళద్దృఢతరధ్యానైకచిత్తాంబుజుల్
స్ఫురదాచారులు, వేదకోవిదులు, ఱేపుఁ మాపు నిక్షేలాకో
కలవైరక్కట యింక నావ్రతము భంగంబౌనో యేమో కదా.

నాలుగుదినంబులనుండియు నా వ్రతంబున కేరును నతిథులు చేకూరకుంటచే సతీసుతులతో నేను ఘోరోపవాసంబులఁ గృశించుచున్నాను. నే నెట్లయినఁగాని, చిన్నకుమారుఁడు మతిమంతుఁ డెట్లాఁకటికోర్వఁగలఁడు? నీకేల యీవ్రతంబు. నీవింత ఫలాహారమైనఁ గావింపు మని యెంతచెప్పినను మతిమంతుఁ డంగీకరింపఁడయ్యె. అక్కటా! ఆఁకటిబాధ యెంతనవచ్చు?

మ. తడిలేదించుకయైన నాలుకపయిన్, దాశ్మాటగున్ మాట, తూ
లెడు దేహం బెటులో, శరీరబలమివ్వాల్గెన్, శ్వాసముల్ మ్రాన్పడెన్
మెడమూలుంగనుదోయి మూతపడియెన్, మేనెల్ల కంపించెఁ, హా
కుడువన్ గట్టుట కుండి కాలవశతన్ క్షుద్బాధకుం జిక్కితిన్.

అయ్యో! మధ్యాహ్నము మీఱుచున్నది. నేఁడును నా కవనీసురుం డొక్కఁడైన జిక్కఁడు కాఁబోలు. ఈరాజమార్గాంతమువఱకు వెదకిచూచెద (నడుచుచు)

రాగము : కన్నడ – ఆదితాళము

భవహర సురవర గిరిజావరా! ఓ॥ భవ॥

పవిధర సురనుత పదజలజా! ఓ
దీనజనావన దీక్షాకరుణాంభోనిధీ! పురాణ పురుషా!
మానిగుణరత్నాకరా! శ్రీకరా! శుభకరా! దయాకరా॥ భవ॥

[పిమ్మట నొకా నొక వృద్ధ యతీశ్వరుఁడు ప్రవేశించుచున్నాఁడు]

యతి—సిరియాళుం డీ మార్గముననే వచ్చుచున్న ట్లున్నాఁడు. నే నీతని గృహంబున కభ్యాగతునిగాఁ బోవుటకు నిక్కడనే యుండెద. (క్షుద్బాధ నటించుచు)

మ. అకటా! నాల్గుదినంబులయ్యెఁగద యాహారంబు సంప్రాప్తమై యిఁక నీ యాఁకటిబాధ కోర్వఁగలనా? యీనాఁడునుం నాకు భుక్తికిఁ గాలంబు గతించిపోయెఁగద క్షుత్పీడఁ శ్రమం జెందు మానికి భిక్షాన్న మిడంగ దాతయొకఁడేనిఁ లేఁడుగా నూరిలోఁ.

సిరి—(ఆకర్ణించి) ఎక్కడి దీ యార్తధ్వని! యెవ్వడో యాఁకటికిఁ దపించుచున్న ట్లున్నాఁడు. (యతిం జూచి) ఆహా! ఈతం డపూర్వ మహిమాతిశయుం డగు నొకా నొక దివ్యపురుషుఁ డుగాఁ గానుపించుచున్నాఁడు.

సీ. చిరకాలవర్ధిత శ్రీతపఃకుజమునఁ
బరిపక్వదశనున్న ఫలమనంగ
కమలసంభవదివాకరుల తేజము లొక్క
మొగిఁదాల్చినట్టి సన్మూర్తి యనఁగ
అలరి నా వ్రతశిక్షణార్థ మేతెంచిన
విమల శివావతారమె యనంగ
మామక పూర్వజన్మ పరిపాకఫలంబె
యీరీతి నాఁకు జేకూరెననఁగ

గీ. తేజమున మించు నీ యతిరాజు నాకు
వెదకఁబోయిన తీవియె పదములఁబడు

గతినిఁ గాన్పించె నిమ్మహామతియుతుండు
తాపసుల పోఁడి యన్యు లీతనికి సీడ !
కావున నిమ్మహాత్ముని నాగృహంబునకు రావేఁడెద. (సమీ
పించి) మహాత్మా! యతిచంద్రా!

సీ. వందనమయ్యా! మీ కిందుశేఖర నామ
మకరందరసపానమత్తచిత్త
అభివాదనము మీకు నైకాగ్రదృఢతపః
ప్రతిభాప్తమహిమ ప్రభావిలాస
జోహారు మీకుఁ బాపాహార్యపాటన
పాటవశితశతకోటిధార
దండంబు మీకుఁ బ్రచండతేజోరాశి
పరిహాసితాంభోజబాంధవుండ

గీ. నతులు వేవేలు, సచ్చితానంద మూర్తి
లలితలోచన కోణగళద్దయాన
హీనతైల ప్రవర్ధిత జ్ఞానదీప
కాంతిభిన్నేంద్రియ వికారఘనతపస్వి!

యతి— అభీష్టసిద్ధిరస్తు. ఓయీ నీవెవఁడవు? నీ విందురా గత మేమి?
సిరి— దేవా! నా వృత్తాంత మెఱిఁగింతు. మహాత్మా!

సీ. కుల మేది మీది నిస్తుల తపోదృఢచిత్త
వచియింపు మేది నివాసభూమి?
యతి— కుల మేల యగ్రజన్ములలోన ఘనుఁడ నా
వాసస్థలంబు ప్రపంచనమితి
సిరి— శివపూజ నెందేనిఁ జేసితిరా? మీర
లేయింట భుక్తి గ్రహించినారు?
యతి— లేదుగా మాకెట్టి భేదము శివునితో
భుక్తిభిక్షాపాత్రి ముక్తియొకటి
సిరి— గీ. యతికులోత్తమ శివపూజ కరుగు టెందు
యతి— వచ్చెదనుగాని నీదు నివాసమేది?

సిరి—చోళదేశంబు.

యతి—(క్రోధముతో) కూళ! పిసాళి! నీవు.

పాపసిరియాళ నృపకుల పాంసనుఁడవె?

సిరి—(స్వగతము) అక్కటా! ఇమ్మహాత్మున కకారణంబుగ నా మీఁద నాగ్రహము కలిగినదేల చెపుమా.

యతి—ఛీ! దుశ్శీలా ప్రొద్దుటనుండియు, నాఁకలి యాఁకలి యని తపించుచు, నీయూర నింటింటిముంగిట నఱచినా నొక్కం డైన నక్కటికమున నాకుఁ బిడికెఁడు కబళం బిడ సాహసించి నాఁడు కాఁడే, మూర్ఖా! ఇంతదనుక నీ వెక్కడ నుంటివి? ఏమి రా నీ ధర్మపాలనము! అభ్యాగతులమైన మావంటివారి కింత నిలువనీడనైన నీయక నీదేశమంతయుఁ దలపైఁ గట్టుకొని పోఁదలంచితివో! ఛీ! మే మిట్టి ధర్మహీనుని ముఖం బెన్నటికిఁ జూడము. కాన నీదారిని నీవు పొమ్ము.

సిరి—అక్కటా! ఇ దెక్కడి గ్రహచారఫలము? దేవా! నాపువవి నింత యాలింపుఁడు. ప్రతిదినంబును నాయింట నభ్యాగతుం డగు భూసురుం డెక్కండైన సాపడకపోయిన నే భుజింప నని యొకదీక్షం బూనియుంటి. అదేమి మాయయో గాని నేఁటికి నాలుగు దినంబులనుండియు నవనీబృందారకు లెందును నాకు సందర్శపడకుండుటచే సతీసుతులతో ఘోరోపవాసనియతి చేఁ గృశింపుచున్నాను. మఱియు నోయతీంద్రా!

ఉ. బాలునితోడఁగూడ నుపవాసముఁ జేయుచు, శైవపాళికై నాలుగునాళ్ళు నే వెదకినన్ గనువత్తులతో, మిముర్ గనన్ జాలని నాదు పూర్వభవసంచిత పాప మ దెంత యుండునో

యతి—రాజా! నిజమా? నీ వట్టివ్రత మూని యుంటివా?

సిరి—నామాట మీకు నమ్మకము లేకపోయిన నే మందును?

గాలముగాని యప్పు డుపకారముసేసినఁ గీడె గల్గెడిన్.

మఱియు నా దురదృష్టదేవత మిమ్ము నాకంటఁబడకుండఁ జేసినను జేసియుండవచ్చును. అట్లు కాకున్న మిము నామందిరంబునకుఁ దోడ్కొని పోకుందునా?

గీ. ఆఁకటఁదపించువాని కాహార మిడక
పుడమి ధనికుండు సేయు నపుణ్య మేది ?
సకలధనధాన్యరాసులఁ జచ్చినపుడు
వెంటఁ గొనిపోవ నెంచిన వీలు ఎదు నె ?

రాగము : బేగడ తాళము : ఆది

స్వాగతముమీకు - సంయమీంద్రచంద్రా! జాగుసేయ
జనదు స్వామీ ధర్మగామీ ॥స్వాగత॥ నేడు మిమ్ముఁబోలు -
నియమవంతులను జూడఁగలిగె పాప మేడకో తొలఁగె ॥స్వా॥

చ. యతివర ! మామకీయనియమావనకార్యధురంధరుండవై
హితమతి నా గృహంబున గ్రహింపుమి యోగిర మీదినంబునం
దతులితసత్త్వపోవ్రతహితాత్ములకౌ భవదాగమంబుచే
వ్రతము ఫలించు, మానికులవార్ధిశశీ ! దయచేయు వేఁడెదన్.

యతి—రాజా ! నీవు నిక్కముగా నాయాగమనం బపేక్షించెదవా ?
నీకుమారుఁడును వ్రతహితవృత్తిచే నుపవసించుచున్నాఁ డని
తెల్పితివి కనుక నాకు గడుజాలి గలుగుచున్నది.

చ. వ్రతపరిరక్షణార్థము ధృవంబుగ ఘోరతరోపవాస న
ద్వ్రతనియతిన్ గ్రహించెనె భవత్సుతుఁ డట్టి సుధర్మశీలుడౌ
సుతుఁడొకఁ డున్నజాలును విశుద్ధగుణాఢ్యుఁడు నాయభీష్టమున్
జతనము సేయఁగాఁ బురుషసంతతిహీను లనర్హు లిద్ధరన్.

కావున నీవు భిక్షసేయ నెంతయు నర్హుండవు. ఒక్కకుమా
రుఁడున్నాఁడుగదా చాలును. అయినను నీ మాటపయి నాకు
నమ్మకము చాలదు. నీవు రాచబిడ్డవు. తలతడిపి బాసఁజేసినను
మేము రాజుల నమ్మజాలము. ఏలయన—

ఉ. రాజులు వైభవార్తనిజరాజ్యమదాంధులు, భూరిపాపని
స్తేజులు, ధర్మహీనులు, సుధీజనదండన దుర్విదగ్ధు లు
ర్వీజనసంపదాహరణవేదులు, క్రూరకురాగ్రహుల్, కటా !
రాజులమాననంబులు కరాళవిషానలతుల్యము ల్గదా !

సిరి—అయ్యో! యతీంద్రా! నన్నిట్లేల తిరస్కరించెదరు? తొలిపుట్టువు
నం జేసిన పుణ్యావశంబున నిరుపమానభాగ్యభోగంబులం దుల
దూఁగుచుండు రాజునైన నాకు నొక్క బ్రాహ్మణున కన్నం
బిడుట కష్టంబగునా? ఎంత మాటాడితిరి!

చ. సిరి తనకున్నమాత్రమునఁ జెందఁగలాఁడె నరుండు కీర్తి ని
ద్ధర, సుగుణాభిరాముఁడయి ధర్మగుణాప్తి సతంబు సత్యవా
క్పరతఁ జరించినన్ యశము సేకుఱుఁగా కనఘాత్మ! సత్యముల్
దొఱఁగి చరించు నా పరమదుష్టుని భాగ్యము కాల్పనే మహిన్.

యతి—నీవు చెప్పినదంతయు వాస్తవమేకాని,

గీ. పరులకు సుబోధ లొనరించువారు భువినిఁ
గలుగుదురుగాని వారిలోపల నృపాల!
యితరులకుఁ దాము సెప్పినగతిని నడచు
పరమధీరుఁడు కోటి కొక్కరుఁడు లేఁడు.

సిరి—మునీంద్రా! మీకు నాపై నట్టి సందేహ మున్నచో నా ప్రమా
ణవచనంబు లాకర్ణింపుఁడు.

సీ. చలమూని నన్ను రాజ్యభ్రష్టుఁ గావించి
కడగండ్ల ముంచినఁ బడుదుఁగాక
నిశితాసిధారకు నిజకంఠ మిమ్మన్న
సంతసంబున సమ్మతింతుఁగాక
కడుహేర్మిఁ బెంచు నా కన్నపాపని వైచి
కుత్తుకఁ జేసేతఁ గోతుఁగాక
బలిమిమై స్వారాజ్యపదవి నిచ్చెద మంచుఁ
దివిదము లేతెంచి చెప్పుదురుఁగాక

గీ. కులము మానము గూలినఁ గూలుఁగాక
పుణ్యమే దెట్లు పోయినఁ బోవుఁగాక
భాగ్యమే దెట్లు వచ్చిన వచ్చుఁగాక
నాల్కఁ గోసిన ననృతంబు వల్కనయ్య!

యతి—రాజా! నీసత్యవ్రతంబునకు మెచ్చితి. ఇఁక నీగ్రహంబునకు

రా నాటంకమేమియు లేదు. నీ భార్యయు నా కిష్టమైన పదార్థములతో నా కాహార మీయ సమ్మతింపవలయుఁగదా!

చ. ఇలపయి నర్థికోటి దరియించెను ధర్మగుణావలంబ చిత్తుల గణియింప లక్షకు పదు గ్గల రందు విశేషసంఖ్య కాఁ
తలఁపు జనించియుండియు స్వతంత్రతఁ గాంచి నిజాశ్రితాళి కీఁ
దలఁపఁ దెగింపలేరు నిజదారలపోరు దురంతమాటచేఁ.

ఇది లౌకిక వ్యవహారవిషయంబె కాన నా సందేహం బకారణంబు కాదు. కావున నా యాగమనంబునకు ముందు నీ యిల్లాలి సమ్మతిం గైకొని రమ్ము.

సిరి—అక్కటా! మునీంద్రా! ఇట్టి విషయమెక్కడనయినా నున్నదా? ఒక్క బ్రాహ్మణున కాహారమిచ్చుటకు నేను నాభార్య యనుమతిం గొనవలయునా! కట్టా! నా కెట్టి నీచపుఁబని బెట్టితిరి? నాభార్య కెట్టి దౌష్ట్యమును గూర్చితిరి! మీ సందేహము నిజముగా నాకు నవ్వుపుట్టించుచున్నది. కుజాతితరుణుల సహజవృత్తున నా భార్య కారోపింపక మీ రింక నా వెంట రండు.

యతి—రాజా! నిజముగా నీ సతియుత్తమ సతియయిన నా యభీష్టము నెఱవేర్పక మానదు. ఇఁక నేమయిన'గానిమ్ము. బయలు దేఱుదము.

సిరి—శా. దారిద్ర్యాతురుఁ డప్రయత్నమునఁ దా ద్రవ్యంపునిక్షేపమున్
దారిం గాంచిన భంగి గంటకపరీతంబౌ తమోజాలకీ
ర్ణారణ్యంబున నర్ధరాత్రి జను మార్గాటుండు దీపంబుఁ గన్నా
రణ గాంచినరీతి డెంద మిపు డత్యానందముఁ జెందెఁగా.

యతి—రాజా! నన్నెట్లు తృప్తిఁగావింతువో! మీయింటికి దారియెటు?

సిరి—దేవా! ఇటు ఇటు.

యతి—రాజా! నీభార్య నీకుఁదగిన సద్గుణధుర్య యని నీ చెప్పిన పలుకుల నమ్మి నే బయలుదేఱితి. తుదకు నన్నక్కడ పరిభవించెదుసుమీ!

సిరి—అట్లెప్పుడును కాదు. మీరు దారిఁ జూచి నడువుడు.

(ఇరువురు నిష్క్రమింతురు) ఇది తృతీయాంకము.

---



ఓమ్ శ్రీర్జయతు.

# బుద్ధిమతీ విలాసము

## చతుర్థాంకము

రంగము: రాజభవనము.

యతి—ఏమోయీ! రాజా! నాకు భోజన మిడుటకు నీ భార్య సమ్మతించినదా?

సిరి—అక్కటా! ఇదెక్కడి యనుమానము?

బుద్ధి—దేవా! మీవంటి తపోధనులు గృహంబున కేతెంచిన భిక్షఁజేయకుండునంతటి యధర్మశీలనుగా భావించితిరా?

సిరి—మ. పరమోదారగుణప్రసిద్ధులు తపఃప్రాంచన్మనీషా విశే
షరుచిజ్ఞానపితామహుల్ విధిహితాచారాత్ములౌ మీర లా
దరమున్ జూపి గృహంబుఁజేరు టశనార్థం బెంచిచూడంగ యతీ
శ్వర! భాగీరథి చాటినేలఁ బ్రవహింపంగ బోర్లినట్లేకదా!

యతి—భూపాలశేఖరా! నీవు కేవలము ధర్మహితుండవు. నామనోభీష్టమెట్లో యట్లే నాకు భిక్ష గావింపవలయు.

సిరి—దేవర యానతిమ్మేరకు.

యతి—రాజా! నా యభీష్ట మెఱింగింతు వినుము.

సీ. కర మర్థచంద్రశేఖరుఁగూర్చి మున్ను నే
ఘోరవ్రతంబుఁ గైకొనినవాఁడ.
నుపవాసములఁ జేయుచుంటిని గాన నా
కీద్వాపవంబు నేఁ డుద్యమంబు

ఘనమైన తద్వ్రతంబునకుఁ బశూపహా
రము నేఁడు భోజ్యంబు, రాజచంద్ర!
అప్పశుశ్రేష్ఠ మన్యం బేదియును గాదు
మానవశ్రేష్ఠుంతు మాంసు వలయు

గీ. నట్టి నరమాంసమును పాక మాచరించి
భక్తి వడ్డింపఁ బార్వతీ భవుల కొసఁగి
భోజన మొనర్తు నీవు నీపుత్రితోడ
నాదు పఙ్క్తిని గూర్చుండినన్ నృపాల!

సిరి—అకటకటా! ఇదెక్కడి వైపరీత్యము! సతీ! మన మీయతీ
శ్వరుచే మోసపోయినారముకదా!

బుద్ధి—అయ్యో! ఇదెట్లు వచ్చె మాకు?

సిరి—మునీంద్ర! నరమాంసమా? అయ్యో! ఇట్టి విపరీతపుఁగోర్కె
యెందైననర్హమగునా? నరమాంసమెక్కడలభించు? ఘోర
మగు పాతక కార్యంబునకు నన్నుఁ బురిగొల్పుచున్నారే!

యతి—(సక్రోధుఁడై) ఆ పాపిష్ఠా! భ్రష్టా!! ఏ మనియెదవు?

ఉ. అక్కఱతోడ నాకుఁ గడుపారఁగ నోగిర మిత్తునంచు న
న్నిక్కడి కీడ్చి తెచ్చి పొగరెక్కిన మాటల మాటలాడెదో
టక్కరి రాజహంసన! శఠా! పరిహాసమ? నానమక్షమం
దక్కడఁ జేసినట్టి సమయంబులఁ దప్పెదవా? నృపాధమా!

సిరి—దేవా! కోపం బుపశమింపుడు. సమస్త ధర్మవేత్త లగు మీరె
యిట్లు కోపింప నే నింకేమనం గలను?

చ. మనము కలంగు, జ్ఞానము సమంబు దొలంగు, నశేషపాపవ
ర్తనలు సెలంగు, యత్నములఁ దాల్మితలంగుఁ, బొసంగువేగ మె
ప్పనికయినన్ దొసంగు, శరభావమెసంగు, యశం బడంగు, నో
మునివర! యెట్టిపాపముల మూలముగాదు దురాగ్రహం బహో!

అట్టి నీచతమంబయిన దురాగ్రహంబువిడచి, శాంతభావం
బున నామనవినిం దాలింపుఁడు.

యతి—ఏది! శాంతస్వరూపుఁడ నగు నీహిత మేదియో విందము.

పిరి—దేవా! ప్రాణిహింస యెట్టిఘోరనరకంబున కాకరంబో మీ కెరుంగనిదియా? "పరోపకారార్థ మిదంశరీర" మ్మను నార్యోక్తిచే బరులకుపకారంబు సేయనగుంగాని హింసింపనగునయ్యా. ఈ శరీరం బిల జన్మించినందులకు సత్కర్మ లాచరణీయంబులుకాని ప్రాణిహింసాది దుష్కర్మ లెట్లాచరణీయంబులగు? అదియుంగాక-

సీ. తనప్రాణములపైనఁ దన కెంత తీపియో
పెరవారి కట్లకా నెఱుఁగవలదె
ధర నహింసయె మేటిధర్మం బటంచు పె
ద్దల నీతివాక్యము ల్దలఁపవలదె
పుడమి నేకులమందుఁ బుట్టితిమో యట్టి
కులహితాచారము ల్నిలుపవలదె
బలవంతముగ నిండుప్రాణంబుఁ దీయుట
కడుఘోరగతి యంచుఁ గరుణవలదె

గీ. మనల నేలాగు మనతల్లి గనెనో. భువిని
పరుల తల్లులుగూడ నాభంగియె కద
'ఆత్మవత్సర్వభూతాని' యనెడు పల్కు
తలువునకు రాదె మునివంశతిలక! మీకు.

కటకటా! అనుచితంబగు వ్రతంబుఁ బూనితిరి కదా మునీంద్రా! ఇట్టిధర్మబాహ్యంబగు వ్రతం బావశుపతికి హితంబగునా? అతులితతపోధనులగు వశిష్ఠాదిమునిగరిష్ఠులు వాతాంబుపర్ణాహారులై యక్షయ్యంగు మోక్షపదవి నధిగమించిరికాని, కేవల తామసాహారంబగు నరమాంసభోజననియతిం బూనియుండిన భ్రష్టులు గాకపోదురా? పుడమిజన్మించిన వారిలో నొక్కొకటికవానికిం దక్కఁ దక్కిన ప్రతిమానవునకుఁ బ్రాణిహింస యనిన నించుక సందేహము గలుగుచుండ వేదవేదాంగ కోవిదులై, యపార తపోవ్రత వ్యాపారపరాయణులగు మీ కేల కరుణరాదు? వ్రతనియతిచే మితిలేని పుణ్యంబు సంపాదించుటకు మారుగా నయ్యయో నిష్కారణముగా ఘోరపాతకంబు గణించి

యిహపరములకు రెంటికిం గొరగాకుండ నుండఁ దలంచితిరే! నా మనం బారయ నెంచి లోకాచారవ్యతిరిక్తమై, దుర్వారన రకోత్పాదనకారణంబై, దురంత సంతాపహేతుభూతంబైన యిట్టి యనాచ్య మభోజ్య మసహ్యపదార్థం బపేక్షించితిరా? న న్నిట్టి క్రూరవిషమపరీక్ష నేల సేయవలసె? విధి కెయ్యదిహితం బయ్యది నాకును హితంబు.

యః తీ—ఓరీ! రాజాధమా! నీ యుపన్యాస మింతటితో ముగిసినదా? దురాత్మా! నీ వలన నేఁడు మేము మోసపోయినారముగదరా. నియమితవ్రతంబున కుద్యాపనంబు సల్ప శక్తి లేక, దానికై పెక్కువాసరంబులనుండియు ఘోరోపవాసంబులఁ గృశించుచున్న యొక్క మునివృద్ధుని కనం బిడుటకుఁ జేతఁగాక, పాతకకర్మం బని భీతి లేక నోటికి వచ్చినట్లెల్ల నిచ్ఛకంబులాడుచుంటివిగదరా! ఓరీ రాజాధమా! సూనృతవచోవిశ్వాసి వనియు, నిరంతరదానధర్మకనిష్ఠాగరిష్ఠుండ వనియు నిచ్చకంపుఁగల్లమాటల నమ్మి నీ గృహంబున కాహారమునకు వచ్చి చెడిపోయితిగదరా! ఇట్టి దుర్మదాంధుఁడవు, లోభివి, సూనృతవచోవిఘాతుండవు, నాకుం గోరినరీతి నన్నం బిడుదు నని యుక్తాయుక్తవిచారణ మాని యేల పల్కితివి? సకలశాస్త్రవేత్తవలె నా యంతటివానికే హిత ముపదేశింప వచ్చితివిగా? ఎంతమీను వచ్చి ఎంతమీనును మ్రింగినది! నా కింక పలుభాష లెందులకు?

ఉ. ఆఁకటఁ జావనుంటిని నృపాధమ నిశ్చయముగ్ వచింపవే
రా! కలుషాత్మ! పొ మ్మనెదవా? కుహనావచన ప్రవృత్తిచే
మాకుహితంబుఁ దెల్పెదు ప్రమాణవచోవిధిదప్పి, క్షుచ్ఛ్రమా
స్తోకకృశానతార్తిఁ బడఁ ద్రోయుదువా నను వృద్ధసంయమిన్.

బుద్ధి—మునీంద్రా! మీవంటి సంయమీశ్వరుల నింటికిఁ దోడ్కొని వచ్చి యూరక పొ మ్మనుదుమా?

యతి—ఊరక పోనీక చంపనుగూడఁ జంపుదురా యేమి?

బుద్ధి—అయ్యో! యెంతమాట? మీరు భోజనముచేసి యే పోవచ్చును కాని, మహాత్మా!

సీ. ఘనపాయసాన్నభక్ష్యము లుండ దుర్గంధ
యుతమైన నరమాంస మొల్ల నేల?
గమగమ వలచు శాకము లెన్నియో యుండ
కడునీచ మగు నరక్రవ్య మేల?
నోరూరఁ జేయు మేలూరుఁగాయలు లేవ
పాపంపుమానవపలల మేల?
సారంబులౌ దధిక్షీరంబు లుండంగ
హేయమౌ నరమాంస మేలవలయు?
గీ. వేదవేదాంగపాఠకవిప్రు లేడ?
నీచనరమాంసభోజననియతి యేడ?
ప్రాణిహింసలు ధర్మబాహ్యములు కావె?
యతికులోత్తమ! యిట్టి దుర్వ్రతము తగునె?

యతి—ఓనారీ! నీ యిచ్చకాల కుబ్బి తబ్బిబ్బులగువాఁడనుగాను. నీ ధర్మోపన్యాసములకు సంతసించి నీకు బహూకృతులొనరింప నే నేమియు సిద్ధుఁడనై రాలేదు. నిష్కారణముగా నేల కంఠముఁ జించుకొనియెదవు? సమస్తధర్మంబుల నెఱింగిన బ్రహ్మవేత్త వలె నటించుచు, లేనిపెద్దరికము పైఁ వేసికొని, నిర్భయంబుగ శంకింపక నోటికి తీరుగాఁ గంచుగీచినట్లు వాగుచున్నావు! ఈ ధర్మ సందేహము దీర్చు మని ని న్నెవరును బొట్టును గాటు కయుఁ బెట్టి పేరంటమునకుఁ బిలువలేదు. స్త్రీవచనంబులందఱు విశ్వసింతు రనియు నేనును నీ మాయభాషలకు లోనై నీపై జాలిదలంతు ననియు నమ్మియుంటివేమి? నీ వీపాటి ధర్మాత్మురాల వని నాకుఁ దెలిసియే తొలుత న న్నాహారము నకుఁ బిలుచుటయందు నీ భార్యయనుమతిం గైకొనకుండ నక్కఱకురాని స్వాతంత్ర్యత గలిగించుకొనవలదని నీ మగనితో నెంత చెప్పినను (సిరియాళునివంకకు దిరిగి) నీ వంద నీ వేమో

మహాధర్మాత్మురాలి వనియుఁ దా నేమో మహాసత్యసంధుం డనియు నాకు నమ్మకముఁజెప్పి, నా మెడలు విరచి న న్నిక్కడి కీడ్చి తెచ్చినాఁడు. ఓరీ! నృపాలా! రాజాన్వయపయోధిబడ బానలకీలా! నామనంబుఁ దిప్పుటకు నీ భార్యను బురికొల్పితి వేమి? ఛీ! దురాత్మా! హరి హర పితామహులు లేకమై వచ్చినను నాపట్టినపట్టు విడుచువాఁడను గాను. బాసచేసిన తెఱంగున మదర్థంబు సిద్ధపరుపుము.

సిరి—మునీంద్రా! మీ కిది బొత్తుగా దగని పని·

రాగము : శంకరాభరణము తాళము : రూపకము

వలదు వలదు మీకు నిట్టి వ్రతము యతివరా!
కలుగు దీన ఘోరఖలుషఫలము మౌనివరా

యతి— కలుషహరుల మమ్ము నెట్టి కలుషము జేరు
తెలిసికొనుము మమ్ముబోలు ధీరులు లేరు॥ కలు॥

బుద్ధి— ధీరుల వాని పాపకర్మపు తెరువు బోజనునె
పరిపాపము వారిఁజేరక యూరక చనునె? ॥ధీరు॥

యతి— ఫుల్ల విరుపుమాటలాడక మూయుము నోరు
గిల్లి జగడమాడు నీతో గెలుతు రెవ్వారు॥ ఫుల్ల॥

సిరి—చేతులార ఘోరహింసఁ జేసి చటుల పాతకంబునకుఁ బాలు వడుదు నే నెటుల.

యతి—ఛీ దురాత్మ !

చ. జడమతి! నాదు వాంఛిత మసాధ్యమఁటంచుఁ దలంచి తేని, ని
ప్పుడ నను లేచిపొమ్మనుట పోలునుగా కిటు నా వ్రతంబునుఁగా
గడు నిరసించి పల్కుటకు, గన్నులఁ దట్టినదే మదంబు, "నీ
కడఁ దొలిబాసఁజేసి యెఱుఁగక జను"మంచు వచింపరాదొకో.

సిరి—(బుద్ధిమతిం జూచి),

గీ. ముందు బావియు వెన్కకుఁ బోవ గోయి
యుయ్యెగద నెచ్చెలీ నేఁడు నియ్యవస్థ

కటకటా! చిక్కులిమి యడక త్రిలోని
పోకచందాన నీ ముని ఢాక కిపుడు.

తరల. చలము వీడఁడుగా మునీశుని శాతరోషవచఃకృశా
నలమునం బడి చావనయ్యెడి నాతి? నేఁ డకటా! కృథా
కలితుఁడై మనమాట కిత్తఁడు గాఁ దటంచు నసాధ్యమా
తలపుఁబూనె న దెట్టు తీర్చుదు ధర్మహీనత మానినీ!

బుద్ధి—నాథా! అధైర్యపడిన నెట్లగు? ఇఁకను బలువిదంబుల నీ
మునిం బ్రార్థింతము. కరుణ జనింపకుండుటకు ఈ మౌని హృద
దము పాషాణమా?

సిరి—కాకున్న నింత కాఠిన్యముఁ జూపునా!

యతి—ఓరీ! కపటశీలా! నీవు మాటలసందడి కాలంబు గడుపు
చుంటివి. ఏల నీ కీ వృథాశ్రమ? నేను నిన్ను బిలువలే దని
చెప్పిన, నీకు నావలన బాధ తప్పెనుగదా! నీ వట్లు చేయుము.
ఉపాయంబు దెలియని వట్టి పందవులా గున్నావు నీవు.

సిరి—దేవా! నా కిట్టి యుపాయములు తెలియవు గాని,

మ. మునివంశోత్తమ! సామవాక్యముల మిమ్ముం జేరి యెట్లయిన మీ
మనమందుం దయగల్గులాగు మిము సంప్రార్థింతు మప్పుడైన, భృ
త్యునిపై జాలిదలంపరేని, విధి యెట్లో యట్లె కానోపుగా
కనఘాత్మా! వచియింపలే నన్మృతముం బ్రాణంబులం బాపినన్.

బుద్ధి—దేవా! మీవంటి తాపసోత్తములు మాకిట్టి పాపోపదేశంబులఁ
జేయవచ్చునా? యెట్టి యిక్కట్టులు మాకుఁ దటస్థించినను
మమ్ము మా సత్యవ్రతంబ రక్షింపవలయుఁగాని మునీంద్రా!

గీ. ఇనుఁ డపరదిక్కునం దుదయించుఁగాక
అగ్ని యుష్ణత సెడి శైత్యమమరుఁగాక
గ్రహసమూహంబు జలజలరాలుఁగాక
మఱపునకునైన నాడినమాట దాఁట.

మతి —(స్వగతము) బుద్ధిమతీ ! నీ వంతటిదానవు లాగున్నావు. (ప్రకాశముగా) బుద్ధిమతీ ! నీ సత్యవ్రతదీక్షనుగురించి నీవు పొగడుకొనుటయేనా, నా కేమైన భిక్ష గావించు ప్రయత్న మున్నదా ?

బుద్ధి—అవశ్యము భిక్ష గావించెదము కాని నరమాంస భోజనవ్రతము మానివేయవలయు నని ప్రార్థనము.

యతి —బుద్ధిమతీ ! నీ విం క లక్ష చెప్పినను నేను వినను. నా కితర పదార్థములతో నేమి పని ? నే నర్థించినది నరమాంసమే. అయ్యదియె మద్వ్రతహితపదార్థంబు.

సిరి—ఇంక నీతనికడ మన వాక్యములు నిరర్థకములే. సఖీమణీ ! ఈ తండు పట్టినపట్టు విడుచువాఁడు కాఁడు. ఇప్పు డెయ్యది కర్తవ్యము?

రాగము - నాటకురంజి. తాళము - రూపకము.

ఇంతిరో మన కేదిదారి - యెటుల తప్పు నీముని బారి
చింత సేయ మనకు నేఁడు - జేటేదియో కలుగనుండె ॥ఇంతి॥
కటకటా యీ మౌని కింత - కరుణగలుగ దేమి మదిని
కటికతన మూని ప్రాణి - ఘాతచేత కూన నేఁడు
పటుతర పాతకనికృతికిఁ - బాల్పడి దయ వీడి యెవ్వని
కుటిలత గుత్తుక గోయుదు-కోరి యెవఁడు మృతిఁ గొప్పును ॥ఇం॥

సీ. ఏదారి బోవుద మెవ్వారిఁ బ్రార్థింత
మేరీతి నీముని బారి దప్పు
నెవ్వని ప్రాణంబు లెవనికి రుచిగావొ
యెవ్వఁ డీయతి కొడ లీ దలంచు
యతిహితార్థము ప్రబలాజ్ఞ నెవ్వనినైనఁ
బట్టి చంపినఁ బాప మెట్టు లడఁగు
నిష్కారణముగఁ బ్రాణిని బట్టి కంఠంబు
చేసేత నెట్టులఁ గోసివైతు

గీ. కటకటా ! సంభవించె సంకటము లెన్నొ
సంయమీశ్వరు నిరసింప సత్యనియతి

భంగమగుఁ దత్పదార్థ మొసంగఁ బ్రాణి
హింసఁజేయంగ నౌను యింకెట్టులౌను.

యతి—ఏమోయి సిరియాళ! మాంసాహారంబు నీద్దపటిచెదవా?
యేదియో యొకటి స్పష్టముగాఁ జెప్పుము. ఏ మిది మారు
పల్కవు? నీమౌనమె నన్ను బొమ్మనుటయా? అలాగుననే
యున్నది. నే నిక బోవుచున్నాను.

బుద్ధి—ఎక్కడికి మీరు రేగెదరు?

యతి—నా యిష్టమైనచోటికి. స్వచ్ఛంద విహారులగు మావంటి
మునీశ్వరులకుఁగూడ మీ యాజ్ఞయా?

బుద్ధి—మాయాజ్ఞ మీ కెందులకు? కాని మీ రేగుటకు గారణము?

యతి—అయినదిక దా?

బుద్ధి—ఏమైనది?

యతి—ఆశాభంగము.

బుద్ధి—ఎవరికి?

యతి—నాకె.

బుద్ధి—ఎవరివలన?

యతి—మీవలననే

బుద్ధి—ఎందువలన.

యతి—బొంకినందువలన.

బుద్ధి—బొంకిన దెవరు?

యతి—నీపతియె.

బుద్ధి—మీరు వింటిరా?

యతి—ఆహా! నేఁ జూచితి.

బుద్ధి—మాటను జూచితిరా? ఎట్లు!

యతి—ఎట్టులా! నీ మగని మౌనముద్రవలన నీరుత్తరకై లేవంబున
నన్ను బొమ్మనుట కాక యీ మౌనమున కేమి యర్థము?

బుద్ధి—దేవా! ఇదియా మే మబద్ధమాడుట? నరమాంస మెట్లు సంఘ
టిల్లునా యని విచారించుచుండిరి గాని నానాథుఁ డేనాఁడైన

బొంకునా? మహాత్మా! మీ రిట్లు వేగిరపడ నెట్లగు? ఒక్క
మానవునిబట్టి వధించుట సులభకార్య మని తలంచితిరా?
పాపభయంబు విసర్జింపవలయుఁ, పన్నరపశువు నీ కార్యంబున
కొప్పింపవలయుఁ, తదనంతరముగదా కఠినకర్ములమై తన్మాం
సము సంగ్రహింపవలయు. ఊరక తిండిగ్రించిన నెట్లగు? అక్కటా!
ఇది ఘోరపాతకంబని మే మిరువుర మొక్కరీతిగా మొరవెట్టి
నను మా హిత మంగీకరింపక పోయితిరి. ఇఁక నెట్లయినఁ గాని
మీ రించుక శాంతింపుఁడు.

—ఔరా! నారీ! నీ వింతదనుక మెట్ట వేదాంతము లేకరువు
బెట్టి కట్టకడకు నా కిచ్చు ప్రత్యుత్తరం బిదియా? ఏకాగ్ర
చిత్తవృత్తి ననుష్ఠింపుచున్న మన్నియమిత వ్రతంబునకు భంగం
బొనరింపఁ గారణభూతులరై, వీసంబైన దోసంబుకుఁ దీసిపోక
మోసంబుసేయ దురాలోచన మొనరింపుచు, మీ దంపతు
లిరువురు నా గోడవయే విచారింపక, నిరుత్తరులై యుండ నేఁ
బోవరాదో? ఆకటి చిచ్చునకు జచ్చు బిచ్చగాని వాకిటఁ
బడవేసి, నీవు నీ మగనితో నే మేమో గుస గుసలాడుచుండ
నేను నెత్తిన నోరుపెట్టికొని, మొఱ్ఱో యని మొత్తుకొనుచు,
నా కేది యుత్తరం బని మిమ్మడుగుట నే త్వరంబనుటగా?
నా కెన్నియో నమ్మకములు చెప్పి యెన్నియో యప్రమాణము
లాచరించి, నన్నిచ్చట కీడ్చి తెచ్చిన నీ యీ మగండు బెల్లము
గొట్టిన చట్టుబాయివలె మౌనముద్ర ధరించి, వీఁడు పోయినదే
చాలు నని, యూరకుండ నింకను నే నిక్కడఁ గూరుచుండి
యేల మలమలమాడుచుండవలయు? తిరిగి నీవు పిలిచినప్పుడీ
వేమియో వెలిగించెద వని, కొండంతయాసచే నేను నీ మాట
లాలించినందులకు, "నరమాంస మూరక లభించునా" యని,
నా ప్రశ్నంబునకుఁ బాము చావకుండను బడితె విఱుగకుండను
వచించి, నన్ను మోసగింపఁబూనినావుగా? (సిరియాళుఁ జూచి)
ఛీ దుర్మతీ! దారిం బడిపోవువాని నట్టెపోనీక, యిచ్చకంబులాడి

నామదికి నచ్చంజెప్పి, యింతదూరముననున్న నీ యీ పాడు
గృహంబునకు నన్నిడ్చికొనివచ్చి, యింతకాలంబు మీ భార్యా
భర్తలిరువు రొకరిచేత నొకరు కొరుకుకొనుచు, వృథాలాపం
బులఁ గాలంబుగడపి, తుదకు నీవు చెప్పుటకు మాఱుఁగాఁ
గపటక్రియాధుర్యయగు నీ భార్యకు నన్నేలాగునైన దరిమి
వేయుమని యాజ్ఞ యిచ్చితివిరా? క్రూరా! నా కాహార
మెవ్వరియింటను జేకూరకుండ భోజనకాలమతిక్రమింపఁ జేసితివి
గదరా! (దుఃఖముతో) కటకటా! నా దుర్గతి! దైవమా! తా
టాకులమంటరీతి నా జఠరంబున నాఁకటిచిచ్చు భగ్గు భగ్గు మని
మండుచుండ మాటాడుటకునైన శక్తిలేక అయ్యయో! చూచు
వారు లేక యాదరించువారు లేక దిక్కుమాలిన పక్షినై
నిష్కారణముగా నేఁడీ కపట రాజాధముని యింటఁ జావవలసి
వచ్చెగదా! దుర్మతీ! ఎంత పనిజేసితివిరా! ఇచ్చకంబుల
నమ్మించి గొంతుగోసితివి గదరా! హా! పరమేశ్వరా! నీ
వ్రత మీ దినమున నీ రాజాధముని కారణమునఁ దీరినది. నా
బల ముడిగినది. నేను చావసిద్ధముగా యున్నాను.

సిరి— అకటా! నేఁ డెట్టి దుర్దినము!

బుద్ధి—మునీంద్రా! మీ వ్రతము భంగమౌ నని చింతింపవలదు.
మీ కిఁక నరమాంసభిక్ష సిద్ధముజేసి యుంచెదను లెండు.

యతి—ఛీ! నిన్ను నమ్మరాదు.

బుద్ధి—నాథా! మీ రింక విచారించుచున్నా రేమి?

క. ఎప్పుడో కానీ దేహము
తప్పదు ప్రాణంబు వీడ ధరణీశ్వర! నే
నప్పన మొనర్తు నిప్పుడ
యప్పుణ్యాత్మునకు భోజనార్థం బొడలిన్.

యతి—ఏమీ బుద్ధిమతీ! ఏమన్నావు? నీ శరీరమాంసము గోసియిచ్చె
దవా? ఛీ! ఛీ! స్త్రీదేహమాంసము కడు నింద్యము. నా
వ్రతంబున కనుపయోగము.

సిరి—అట్లయిన బుద్ధిమతీ! గుణవతీ!

గీ. నా శరీరముగోసి యతీశ భోజ
నార్థమిచ్చిన ధన్యాత్ముఁ డగుదు గాన
చంద్రహాసంబు జేఁబూని సరగఁ నాదు
కంఠమును గోసి మాంసపక్వం బొనర్పు.

బుద్ధి—హా! దైవమా! నా కెంతటి దుష్కాలముఁ దెచ్చితివి. బుద్ధిమతీ! నీ వెంత మందభాగ్యురాలవే.

సిరి—సతీమణీ! యేల సందేహించెదవు?

బుద్ధి—ప్రాణపతీ!

సీ. వరియించితిని స్వయంవరమున నేవాని
నవరూపకాంతి వైభవము గాంచి
గణియించితిని మనోజ్ఞ యశంబు నేజేని
పాణిగ్రహణభాగ్యఫలముచేత
రాణించితిని సతీరత్నాగ్రగణ్యనై
యేవాని ధర్మప్రవృత్తిచేత
సమయించితిని పాపచయముల నేపుణ్య
పావనపాదాబ్జసేవచేత

గీ. అట్టి నవమోహనాకారు ప్రాణనాథు
సారగుణధారుఁ గలుషవిదూరు మిమ్ము
దార నగు నేను వధియింపఘోరపాప
కర్మమెందైన గలదె వినిర్మలాత్మ?

నాథా చేసికొనినమగని వధించినకులాంగనకు సద్గతి యెక్కడిది? అయ్యో! నీచపుఁబని నా కేల కల్పించెదరు?

సిరి—అట్లయిన స్వయముగా నేనే యా మహోత్సవ మాచరించుకొనియెదను. చంద్రాయుధము నా యొద్దనే యున్నదికదా.

బుద్ధి—అక్కటా! ఎంతకష్ట మెంతకష్టము!

సిరి—బుద్ధిమతీ! ఎప్పటికైన నీ ప్రాణికి నిర్యాణంబు కలిగియే యున్నది. నీ వేల చింతిల్లెదు? చూడు,

సీ. వంశంబు నేటితో ధ్వంసంబుగాకుండ
వరసుతుఁ డొకఁ డున్నవాఁడు నీకు
కలికి! కంటికి రెప్పవలె వానిఁ గాపాడి
వైవాహికాదిశుభముల నెఱపి
సర్వసర్వంసహాచక్రంబునకు వాని
శీఘ్రంబె పట్టాభిషిక్తుఁ జేసి
తరుణి! నీ కోడలు కాపురము దిద్దుచునుండఁ
గన్నారఁ జూచు సౌఖ్యంబుఁగాంచి
గీ. అతివ! నీ వింక మద్వియోగార్తిఁ బాసి
నందనునిఁ జూచుకొనుచు నానంద మొందు
లేమ! మతిమంతుఁ డిపు డింట లేకపోయె
లేదు సుతుఁ జూచుభాగ్యంబు లేదు నాకు.

కావునఁ బరలోకమునకుఁ బోవు నా పలుకుగాఁ గులశేఖరుండగు మతిమంతునితో నిట్లు చెప్పెను. పుత్త్రా! మతిమంతా! నేఁటికి నీవు తండ్రిలేని బిడ్డవైతివి. అయినను నీతివిశారదుండవైన నీవు దుఃఖమును వదలివేసి తెలివిచే రాజ్యభారంబు వహించి చక్కఁగాఁ బాలింపుకొనుచుండుము. మఱియు,

మ. ధరపై నిల్చితి వొక్కరుండ విపు డేతద్వంశమున్ నిల్ప నం
కురమై నేఁటికిఁ బుత్త్రకా! యెటులఁ జేకొందో యశం బింతటం
బరలోకంబున కేగునావయిని బ్రేమం బెల్ల వర్జించి, యు
క్కఱతో దోసమునిల్ప్ప వీడు మింక నాకై తండ్రి నీ కౌటచేన్.

బుద్ధిమతీ! ఇఁక నేఁ ద్వారంపడవలయు. ఇదియే నిన్ను నే నిహాంబాసం జూచుట. మునీంద్రా! నే నిప్పుడు మీరాక నధీనుండ నయ్యెదను. కావున—

చ. దినకరకోటితేజ! త్వదధీనముచేసితినయ్య నా యొడల్
కనికరమెంచి న న్నిపుడు గాచిన మీరలె, లేక కంతమున్
దునిమిన మీరె, మీ మదికిఁ దోఁచినయట్టుల నాచరింప వ
చ్చును మునినాథ! మామకవచోవిధి కింత కొఱంత గల్గునే?

యతి —(స్వగతము) ఆహా! ఏమిది! ఈతఁ డింకను జలింపకున్నాఁడు. తనశరీర మిచ్చెద నని సిద్ధపడినాఁడు. ఇప్పుడు నేను మరి యొకపన్నాగము పన్నెదను. (ప్రకాశముగా) ఔరా! రాజా! ఎంత కుచ్ఛితంపుఁ బ్రత్యుత్తర మిచ్చితివిరా! యాచకుం డొక్క రూక నిమ్మని ప్రార్థింప, నాలాగుననే యని సత్తురూక నిచ్చు మహాధర్మాత్ముని భంగి, నే నర్థించిన పదార్థమయ్యును నా కనుపయోగమగునటు లీఁదలంచి, నన్ను మోసగింపఁ బూనితివిగదరా! ప్రాణంబులఁ బాసిన, నా నోటివెంట నసత్యంబు రానీయ నని, నాకడ నెన్నియో యాశాశపంచాంగంబు లేకరువుబెట్టి, యమాయకుఁడ నగు నా మనసున కెక్కున ట్లెన్నియో యసత్యప్రమాణంబు లాచరించి తుదకు నాశాభంగము గావించితివిగదరా! ఔర! నీ సత్యవచశ్శీల మేమిరా! హరిశ్చంద్రనరేంద్రుఁ డన నీవకాఁబోలు ఛీ! ఘోరపాతక కర్ముండ వగు నీ ముందర పుణ్యస్వభావుఁడగు హరిశ్చంద్రుని పేరు దలంచితి? సత్యవచోధురంధరుండైన, యమ్మహానుభావుండు, సద్యశశ్చంద్రికల లోకమెల్ల వ్యాపింపఁ జేసినాఁడు. ఇఁక నీవో, నిరంతర మసత్యభాషణ విశేష మనీపాంచితుఁడవై యీ చతుర్దశభువనములయందును, దుష్కీర్తి యను కటిక చీఁకటుల గ్రమ్మజేయుచున్నావు. ఓరీ! అసంబద్ధ ప్రలాపీ! అసత్యవచోదుశ్శీలా! ఇంతవరకు మీ యింట నను బందెవెట్టి తుదకు "నా శరీర మిదిగో" యని మోసగింపఁ బూనినావురా? నీ శరీర మెవ్వరికిఁ గావలయు? "రాజ్యాంతే నరకమ్ ధ్రువ" మ్మను పెద్దల వాక్యము నే నెరుంగనా? ఓరీ! మానుషాధమా!

మ. పలితంబౌ శిరమెల్ల నుద్ధత జరాభారంబుచేతన్ వడం
కఁ,లవంబేనియుఁ గ్రొవ్వు లేక తనువున్ గామోపభోగార్తిఁ గ
శ్మలమై కాటికిఁ గాళ్ళుసాచిన జరామాంద్యుండవౌ నీ యస
త్ఫలలంబున్ భుజియించినన్ వ్రత మెటు ల్భంగంబు గాకుండురా.

క్రొవ్వులేక రుచిలేని మాంసశోణిత విదూరమైన నీ శరీర మా శివునకు ఫలహారముగా నిచ్చుట? చాలు నీబిక్ష నాకక్కఱ లేదు కాని నన్నీపాటికిఁ బోనిమ్ము. నీవు ప్రాణములనుగూడఁ దీయగలవాడవు. నీవు బ్రహ్మఘాతుకుడవని నీ ముఖము నాకుఁ జెప్పుచునేయున్నది? నిన్నుజూచిన దురితము, ఘోరపాపము, కలుషము. (పోబోవ)

బుద్ధి—మునీంద్రా! మీ రేల మమ్ము సంకటముల ముంచెదరు? మా ప్రార్థన మాలింపుడు.

యతి—ఛీ! యిక నీ మాట వినను.

సిరి—దేవా! కోపం బుపసంహరింపుడు.

యతి—దుశ్శీలా! నీవు ఘోరపాతకుడవు.

సిరి—దేవా! మీ యభీష్టమేదియో తెలుప యీలాటి పరుషవాక్యముల మమ్ము గాసిపెట్టిన మే మేమందుము?

యతి—రాజా! నాకిఁక జుట్టుమాటలు పనికిరావు. నాకు నీవలె బూటకంబును మొగమిచ్చకంబులును తెలియవు. కాన నొక్క మాటుగాఁ జెప్పుచున్నాను వినుము.

సిరి—వినుచున్నాను.

యతి–చ. జనవర భిక్షనీయఁగ నిజంబుగ నిష్టముగల్గెనేని నా
కనువగువానిఁ జెప్పెద బదారవయేటికి మించనట్టి చ
క్కని యొక బ్రహ్మచారుని నగణ్యుత రాగమశాస్త్రవేది యు
ర్వ్యనిఁ దలిదండ్రులున్ గలిగియుండిన బాలుఁడుమాకునర్హుఁడౌ.

ఈరీతి నాకోరిక మిచ్చెదవా యందులకుం గడంగుము. లేదా ననుఁ బొమ్మనుము.

సిరి—అక్కటా! ఇదెక్కడికోర్కి మునీంద్రా!

సీ. చావన్న మాటకే సంతాపపడునట్టి
మానవుం డొప్పునే మరణమునకు?
మరణంబునకు నొప్పు నరుఁ డుండునే మాడు
చదువరిమే యెట్లు సంభవించు?

పదియు నారేండ్ల లోపల నట్టి షట్ఛాస్త్ర
కుశలుడై చావురా గోరునెవడు?
యట్టి యుత్తమశీలుడౌ బాలునకు తల్లి
దండ్రులు బ్రతికియే యీఁగ విధియొ?

గీ. తల్లిదండ్రులు తమకన్న తనయవరుని
చంపుమని చేతికిత్తురే సంయమీంద్ర!
కోరరానట్టి విషమంపు గోరికెలను
శ్రీమల ముంపఁ దలతురే జాలిమాలి?

యతి—అవును. నావలన నీకు శ్రీమయే కావున నేఁ బోయెదను. నీ
వస్నృతమాడినను సరే.

బుద్ధి—మునీంద్రా! కొంచమోపిక పట్టుడు.

యతి—బుద్ధిమతీ! నేనిక క్షణమాగను. మీ రెట్టులైన నన్ను శ్రీమల
బెట్టదలంచుచున్నారుగాని నిశ్చయముగా నాకోర్కి దీర్పవలయు
నను దృఢభక్తి వెదకిన న్నావ్రతంబునకు దగిన పదార్థంబు మీకు
లభింపకుండునా? దుర్మార్గులరు మీరట్లు చేయరు కాని

సిరి—దేవా! మీరు రర్థించిన వ్రతాన్నమునకుఁ దగినబాలుఁ డెందు
న్నాడో చెల్పిన నాకు వాడు సాధ్యుఁడైన మీకుఁ దెచ్చి
యిచ్చెదను. మీ రానతిండు.

యతి—ఏమీ సాధ్యుఁడైన ?

సిరి—లే దెట్టులైన.

యతి—యోజించుకొనుము.

సిరి—నా కెందును దోఁచలేదు.

యతి—ఆ బాలుం డొక్కచో నున్నాఁడు. వాఁడు మీకు సాధ్యుఁడే.
వానిఁ జంప నిచ్చగింతువా?

సిరి—మీకొఱకై యగ్నినైన నురికెదను. ఎక్కడ?

యతి—బుద్ధిమతీ! చెప్పవలయునా?

బుద్ధి—ఆజ్ఞ.

యతి—వలదు. ఏమిప్రయోజనము? విచారనత్యమాడిన నేనేమిసేయుదు?

సిరి—మునీంద్రా! మామాటయం దంత విశ్వాసము లేదా?

యతి—ఈ నక్కవినయముల కేమిగాని ప్రమాణ మాచరింపుము.

సిరి—(స్వగతము) దేవీ! ఇదెక్కడి ప్రమాణము! (ప్రకాశముగా) మీయిష్టానుసారముగానిండు.

యతి—అట్లులయిన నేఁ జెప్పిన ట్లనుము.

సిరి—సిద్ధముగా నున్నాను.

యతి—మీరు చెప్పిన బాలుఁ డెవండైనను నెట్టి ప్రేమాస్పదుం డైనను శంకింపక వధించి తదామిషంబు మీ కాహారంబుగ నిచ్చెదను. ఇందులకుఁ దప్పిన గురుద్రోహంబునకును, కన్యావిక్రయపాతకంబునకును బాత్రుఁడ నగుదు. సాక్షులు సూర్యచంద్రులే! (అని రాజుచేతఁ జెప్పించుచున్నాఁడు) ఇఁక నేఁ జెప్పవలయునా!

సిరి—ఇం కేమి యనుమానము?

యతి—అటుగాదు. నీవొక్కరుఁడవు బాసచేసిన నా కేమి నమ్మకము? కనిపెంచుదానవుగాన బుద్ధిమతీ! యోజించుకొనుము. నీమగని ప్రమాణ మంతగా లెక్కగొనఁదగినదికాదు. ఏల యన—

మ. నవమాసంబులు మోసి మోసి కని నానాభంగులం గష్ట సౌ
ఖ్యవిధానంబుల కోర్చి, రేలుఁబవలుం గాపాడుటం దల్లికు
న్నవిధంబుండదు తండ్రి కాత్మజులపైనన్ బ్రేమ యోజింపుమో
యువతీ! యూరకయందు రమ్మగవాఁడో మానో' యన్ సామెతన్.

బుద్ధి—(స్వగతము) ఈ మౌనివాక్యము లర్థాంతరగర్భితములుగా నున్నవి. ఈతఁడేమి చేయుచున్నాఁడో? ఏమైనగాని (ప్రకాశముగా) దేవా! సత్యానుసరణముకదా కులసతికి ముఖ్యధర్మము?

యతి—అట్లైన నీవును బ్రమాణ మాచరింపుము.

(వెనుకటిరీతిఁ బ్రమాణము చేయించును)

సిరి—దేవా! ఇంక సెల వీఁదగును. ఆ బాలు డెక్కడున్నాఁడు?

యతి—ఎక్కడనో యేల? మీ యింటనే

బుద్ధి—(స్వగతము) అక్కటా! మా మతిమంతుఁడు కాఁడుకదా!

సిరి—అయ్యో! మా యింట నెవరు?

యతి—ఎవఁడా? నీకుమా...

సిరి—బుద్ధి—హా! పరమేశ్వరా! (మూర్ఛిల్లుచున్నారు.)

బుద్ధి—అక్కటా! దైవమా! తుదకు మ మ్మింత దుర్గతికిఁ దెచ్చితివి?

సిరి—హా దేవీ!

మ. కలయా? నిక్కమా? భ్రమించితినొ? యజ్ఞానాబ్ధిలో నుంటినా?
యలివేణీమణి! నే సజీవుఁడనొ? నిద్రావస్థ నున్నానొ? యా
కులపా టొందితినా? భయంపడితి నో? కో నాకు నాకర్ణముల్
గలవా? నేఁజెవులార వింటిన ముని క్రూరోగ్రభాషావళిన్?

యతి—రాజా! నీ కేమి చెవుడా యేమి? అట్లయిన మరియొక సారి వినుము. నీకుమారుని మతిమంతునిఁ జంపి నాకు మాంసాహార మిమ్ము. ఇప్పుడైనను నీకు వినంబడినదా?

బుద్ధి—హా! మతిమంతా! నీ కెంతటి కష్టకాలము సంభవించెనోయీ! తండ్రీ! నీవు నాకడుపున నేల పుట్టితివి? నీ వెక్కడనైన జన్మించి యుండిన నీకీ యస్వాభావిక మరణము సంభవించదుగదా. ఇఁక దుఃఖించిన నేమి ప్రయోజనము? ఈ మహారాజునకు ధైర్యమే రీతిగలుగు? నాథా! ప్రాకృతు లట్లు మీ రిప్పుడు శోకంబున మునుంగరాదు.

సిరి—సతీమణీ! వంశపవిత్రుండైన కొడుకు పాలిటి నిర్ఘాతపాతసదృశమైన యీ మహానివచనంబు విని నేనెట్లు ధైర్యము వహింపఁగలను? అకటకటా! యీముని కింతఘోరవాంఛ యేల జనియించె? కరుణారహితులగు కిరాతులకు గలుగవలసిన నీచబుద్ధి యిమ్మహాత్మున కేల కలుగవలయును? అయ్యో! యీ యతీశ్వరు దూషించిన ఫల మేమిగలదు? ముందువెనుక లరయక కోరినరీతి నాహార మిచ్చెదనని వాగ్దానము చేసిన నన్ను నేనే దూషించుకొనవలయును. ఛీ! సిరియాళా! పుత్రఘాతుకా! బలవంతముగ పుత్రుని చంపివేయ జన్మించిన నిన్ను నీవే నిందించుకొనక పుణ్యమూర్తియగు నీమహానియందు నేర మారోపింపఁజూచుచున్నావు. ఇప్పటికైన నీహృదయమును బదిలపరచుకొమ్ము.

గీ. మానసమ! నీవు మామతిమంతుమీఁది
మోహమున మాని దూషింప సాహసింతె
ఘోర దుర్వార నారకకూపమందు
బడఁ దిలంపక మానుమీ వెడగుబుద్ధి!

ఛీ! నాయదృష్టము.

మ. ఘనుఁడై సప్తసముద్రముద్రిత సమగ్రక్ష్మాతలం బంతయున్
దనబాహాయుగళంబుపై నిలిపి వేఁ దప్పించు నాభారమం
చను నాయాసలకెల్ల మూలమెవ్వఁడో యా నాకులోద్ధారకున్
దనయున్ భూరినయున్ వధించికొన ధాతా! యింతగా వ్రాసితే.

యతి—ఏమిరాజా! గౌరవపూర్వకముగా మావంటి యతిథుల కాహార మీఁదగుఁగాక! ఈరీతిఁదిట్టుచు సమకూర్చిన నేమిప్రయోజనము? నీకు నిశ్చయముగా నాకు భిక్షగావింపవలయునను దృఢభక్తియే యున్నచోఁ బుత్రునైన నేమి మఱియెవ్వరైన నేమికంటఁ దడిపెట్ట కుండ వధించి నా యభీష్టము నెరవేర్పుము. లేదా పొమ్మనుము.

ఓరి! మూఢుఁడా!

గీ. ఆదరాయత్త చిత్తుఁడై యతిథి కిచ్చు
మంచినీరైనఁ జాలును మానసమున
"నేలవచ్చెను మనయింటి కిట్టి మొండి"
యనుకొనుచుఁ బెట్టు పాయసంబైన విషమె.

కావున సంతోషపూర్వకముగాఁ బుత్రుని వధించి తదవయవంబుల నారితేరిన వంటలవారిచే జక్కఁగాఁ బచింపించి నాకుం గడువార నోగిర మిమ్ము. నావాక్యపద్ధతి నీకిష్టమైనచో నీకుమారుని బిలిపింపుము. లేదా బొంకుము. నేఁ బోయెదను.

సిరి—దేవా! నే నన్నిఁటికి సిద్ధుఁడనై యున్నాను. ఏలయన—

గీ. కొడుకుల శిరంబు చేసేతఁ గోయు మనుచు
నా నొసట స్పష్టముగ వ్రాసి నలినభవుఁడు
భూమిపై నన్నుఁ బుట్టించె మునివరేణ్య!
పాతకుఁడు వీఁడు నిజపుత్రఘాతుకుండు.

మీరు స్నానమాచరించి (అని సందేహించి) దేవా! కొంచె ముందుఁడు (బుద్ధిమతిం జూచి) దేవీ! వింటివికదా భగవానుఁడగు నీయతీశ్వరుని యభీష్టము. ఇంతకు ముం దాతఁ డానతిచ్చినట్లే తండ్రి కన్నఁ గన్నతల్లికే కుమారులపైఁ బ్రేమయెక్కుడుకదా. మన సత్యవ్రతరక్షణార్థమై మనకుమారు మతిమంతుని నేఁడు వధించి యీ యతికి భిక్ష గావింప నిశ్చయించితి. నీవా బిడ్డకు తల్లివిగాన నీ యనుజ్ఞకై మరల నిన్నడుగవలసివచ్చె. చెప్పు మీ యతీశు స్నాన మాచరించి రమ్మనవచ్చునా?

బుద్ధి — నాథా! మన హృదయంబు లేనాఁడైన భిన్నాభిప్రాయములఁ బూనియుండెనా? మన సత్యవ్రతంబునకై మన మతిమంతు నొక్కనినేకాదు; నీచతరంబైన నా దేహమునుగూడ సంతోష పూర్వకంబుగ నీ యతి కిచ్చెదను. అమలంబగు సత్యంబునకై దేహంబులఁ దృణప్రాయములు నెంచి మానికి స్వశరీరమాంసం బిచ్చి ననుకీర్తి ప్రపంచంబున నిల్చినం జాలదే.

సిరి — బాగు. బుద్ధిమతీ! నీ వింకొకజన్మముననైనఁ బుత్రవియోగ దుఃఖం బనుభవింపకుందువుగాక!

యతి — (స్వ) బుద్ధిమతీ! నీవు యిల్లాండ్రలోఁ కెల్ల ధన్యతమురాలవు. (ప్రకాశముగ) అలాగైన రాజా సర్వముసిద్ధము చేయుము. నే మజ్జనక్రియలఁ దీర్చివచ్చెదను. (పోవుచు) ఆహా! బుద్ధిమతిం బోలిన సాధ్వీమణు లింకెవ రుందురు? యీ పుణ్యదంపతులహృదయంబు లింకఁ జలింపవు. పాఠశాలనుండి యింటికి వచ్చుమతి మంతుని దుర్బోధ లొనరింప మా భృంగిరిటునిఁ బంపిచూచె దను. పిమ్మటికార్య మెట్లగునో చూచెద. (నిష్క్రమించును.)

సిరి — దేవీ! నీవును బాకశాలకు బోయి సన్నాహము సేయింపుము.

బుద్ధి — పోవుచున్నాను. కాని మన మతిమంతుని శీఘ్రంబుగ బిలిపింపుఁడు కాలహారమైన ముని యూరకుండఁడు.

సిరి — దేవీ! అలాగుననే (బుద్ధిమతి నిష్క్రమించును.) ఓరీ యెవఁడురా అక్కడ.

భద్రు — దేవా! ఆజ్ఞాపింపుఁడు.

సిరి — భద్రా! నేఁటి వృత్తాంతమంతయు నీవును వినియే యుందువుగాన

సీ. ఏ వానిరుచిరముఖేందుబింబము సూడ
నిరతంబు నవ్వువెన్నెలలఁ గాయు
నేవాని కమనీయ మృదుభాషణంబులఁ
జిప్పిలు నమృతంపుశీకరంబు
లేవాని మహనీయ హృదయాబ్జమున జారు
జ్ఞానంపుఁ బేరేఁటి కమ్మ తేనె
యేవాని నిశ్చల దృఢభక్తి మెప్పించి
లాలించి నీశుఁ గైలాసవాసు

గీ. అట్టి చిన్నారిపొన్నారి యనుఁగుఁ బ్రేఁడు
చదువుచున్నట్టి యా పాఠశాల కేఁగి
చేతులారంగ నీతండ్రి చెలఁగి నిన్నుఁ
జంపఁ దోడ్కొని రమ్మని పంపె నను.

భద్రు — హా! ఎంతకష్ట మెంతకష్టము! మహారాజుగారి కీ నాఁడెంత దుఃఖము సంభవించినది! పుత్రుని వధించి యాతఁ డెట్లు ప్రాణంబుల భరింపఁగలఁడు! హా! దైవమా! మమ్ము రక్షించు వా రెవ్వరు? నేఁటికి మీరివంశమున నింత సంకరమైన లేక నశింప వలయుఁగదా. అయ్యో! మా భాగ్యము లీపాటివయ్యెనా! (నిష్క్రమించును.)

సిత — అక్కటా! నాకు సర్వాశాపరిపూర్తి యయ్యెఁగదా!

గీ. పుత్రు ముందట నేఁబోవు పున్నె మెల్లఁ
గడిచి విపరీతముగ నాదు కనుల యెదుటఁ
జేతులార్వగ నేఁ గోలుపోతి సుతుని
దరలెఁ దనయు ఋణానుబంధంబు నాకు.

ఇఁక నాహృదయమందు దుఃఖమణఁగ కెడమీరాదు. పాఠశాలకు యతీశుం డేతెంచినాఁడేమో పోయి చూచెద.

(నిష్క్రమించును.) చతుర్థాంకము.



శ్రీరస్తు.

# బుద్ధిమతీవిలాసము

## పంచమాంకము

రంగము : రాజమార్గము.

(పాఠశాలనుండి మతిమంతుఁడు ప్రవేశింపుచున్నాఁడు)

ఏమిచెప్పుమా మధ్యాహ్నము మీఱినను తండ్రిగారు నన్ను భోజనార్థమై పిలిపించినారుకారు. నేఁడును నతిథులేరును జిక్కరుకాఁబోలు. అక్కటా! వ్రతభంగము సంభవించు దుష్కాలము ప్రాప్తింపనే దైవమా!

ఉ. అలరులకంటెఁ గోమలములౌ తలిదండ్రుల దేహముల్ క్షుధా
కలనఁ గృశింపఁజేసితివిగా నియమంబున కంతరాయమై
నిలచి యజస్రభోజనమణీ కనకాంబరదాన తోషితా
ఖిల ధరణీసురుం డెవఁడో గీడ్వడె నాతఁడె నేఁడు పొట్టకై.

(పిమ్మట భృంగిరిటుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

సిరియాళకుమారుఁడీమార్గమువనే వచ్చుచున్నాఁడు. వాని కడకేగి మాస్వామియగు పరమేశ్వరుఁ డాజ్ఞయిచ్చిన విధంబున వర్తించెదను. (మతిమంతు సమీపించి) ఆబ్బాయీ! నీ వెవఁడవు?

మతి—నేను రాజకుమారుఁడను.

భృంగి—పేరు?

మతి—మతిమంతుం డందురు.

భృంగి—నీతండ్రి యెవరు?

మతి—దిగంతవిశ్రాంత యశోవిశాలుం డగు సిరియాళ నృపాలుండు నాతండ్రిగారు.

భృంగి—(మతిమంతునిం గౌఁగిలించికొని దుఃఖము నభినయింపుచు) నాయనా! నీవేనా సిరియాళుని కుమారుండవు?

శా. ఆహా! యెంతటిఘోరదుర్గతికిఁ బాల్పైనాఁడవో రాకుమా
రా! హా! మారశరీర! పాతకవిదూరా! నిర్మలాచార! యే
ద్రోహం బెన్నఁ డెఱుంగనట్టి సుకుమారుం డైన నిన్నుఁ బాధింపఁగా
నూహించెంగద దైవ మెంత కఠినంబో? ఘోరమో? దారకా!

మతి—అయ్యా! నీ వెవ్వఁడవు? నా కేవిపత్తు సంభవించినది? ఒక వేళ సంభవించెనే చూడు! దానికై నీ వింత తల్లడిల్ల నేటికి?

గీ. పూర్వభవజాత కార్మికఫలమువలన
బ్రాణికిం గల్గు సుఖదుఃఖఫలము లిలను
నెల్లకాలంబు సుఖమునే యెవఁడు గాంచు
నెప్పు డెయ్యదిరామో యది తప్పదుగద!

భృంగి—(స్వగతము) అహా! వీనిమనోధైర్య మెంతనవచ్చును? (ప్రకాశము) అబ్బాయీ! నీవు కుఱ్ఱవాఁడవుగాన నీకుఁ గష్టసౌఖ్యము లజాడ దెలియకున్నది. అన్నియుం దెలిసిన నే నెట్లు నీకిప్పుడు సంభవించిన యీకీడుఁజూచి చింతిల్లకుందును? రాకుమారా నిన్నుం జూచిన నాకు దుఃఖ ముప్పొంగుచున్నది.

మతి—అయ్యా! నీదుఃఖమున కేమికారణము? ఓకరుణామయా!

సీ. మారాష్ట్రజనుల కేయూరాటములు సంభ
వింపకుండెనుగదా విప్రవర్య
ధర్మంబు విడిచి మాతండ్రి యాశ్రితకోటి
కేదేని నపకార మెంచఁడుగద
వ్రతమునకయి యుపవాసంబులను సల్పు
తల్లిదండ్రులకు భద్రంబెగా దె
ప్రబల శాత్రవుల నెవ్వరిచేతనే గాని
విపరీతవిధి సంభవింపదు గద

సీ. వసుమతీసుర! నీ దీనభావము గని
నేను తమిచేత నడిగితిగాని రావు
కష్టములు ధర్మమార్గాను గాములకును
ధర్మమే జయ మనుట వ్యర్థంపుఁ బలుకె?

భృంగి—అయ్యో! నీ వింకను దల్లిదండ్రు లనుచున్నా వేమి? ఎక్కడి తల్లిదండ్రులు?

మతి—హా? ఏమీ! తల్లిదండ్రులే లేరా?

భృంగి - అట్టివారు లేనట్టులే!

మతి—హా! తల్లీ! హా! తండ్రీ! (మూర్ఛిల్లును)

భృంగి—కుమారా! లెమ్ము. నే నంతయుం జెప్పెదను.

మతి—అయ్యో! అటుపైని వినుట యెందుకు?

గీ. అయ్యయ్యో దిక్కుమాలి యల్లాడు మనుచుఁ
బోయితివి ముందుగా స్వర్గమునకుఁ దల్లి!
చిన్నఁవాడను న న్నేమి చేసినావు?
తండ్రి! నీకైన దయ గల్గదా! లవంబు?

భృంగి—రాకుమారా! దుఃఖింపకుము. నీ తల్లిదండ్రులు—

మతి—(ఆతురతతో) అయ్యో! తల్లిదండ్రు లేమైరి?

భృంగి—(విసుకుతో) ఏమైనా! చచ్చిరి.

మతి—అక్కటా! జననీ! జనకా! నన్ను వదలిపోయితిరా? అయ్యో! బ్రాహ్మణోత్తమా! ఇఁక నన్ను వదలి వేయుఁడు.

గీ. తల్లిదండ్రులు తమ కన్నతనయు వదలి
నరగఁ గైలాసమునకు నేఁ డరిగిరి గన
నచటనైనను వారల నాదరింపఁ
బయనమై వారిఁ గలయుట పాడి నాకు.

భృంగి—కుమారా! వారు కైలాసమునకుఁ బోఁదగినవారు కారు.

మతి— మరి యింకెక్కడకి?

భృంగి రకలోకమునకు.

మతి—ఇప్పుడు వారు నరకమునకే పోయిరా?

శృంగి—ఇంకను బోలేదు.
మతి—మరి యిప్పు డెక్కడ నున్నారు?
శృంగి—మీయింటనే.
మతి—ప్రాణములతో నున్నారా?
శృంగి—అహా! నీ ప్రాణములకొఱకై వారు సజీవులై యున్నారు.
మతి—నిజమేనా?
శృంగి—సూర్యుఁ డుదయగిరి నుదయించు టబద్ధమా?
మతి—అయ్యా! నాకుఁ బ్రియము మెటింగించిరి.

గీ. తల్లిదండ్రుల మరణవార్తలకుఁ బెల్లు
తల్లడంపడు నాదుచిత్తమున కిట్లొ
మరల నెమ్మనిఁ గూర్చితి మండుచున్న
కొంపపైఁ గుంభవర్షంబు గురిసినట్లు.

కాని అయ్యా! పుణ్యమూర్తులైన నాతల్లి దండ్రులు నరకమున కేల పోవలయును?

శృంగి—పుత్రఘాతుకులకు నరకద్వారములుగాక స్వర్గద్వారములు తెఱవఁబడునా!
మతి—పుత్రుఁ డెవఁడు?
శృంగి—నీవు కావు?
మతి—న న్నేమి ఘాతచేసిరి?
శృంగి—ఇఁకను జేయలేదు. చేయ నున్నారు. చేసెదరు.
మతి—ఎప్పుడు?
శృంగి—ఇప్పుడు.
మతి—ఎందులకు?
శృంగి—ఎందులకా? నాయనా! నీకీ ఘోరవార్త యెట్లు వినిపింతు నోయీ?

ఉ. హాలహాల ప్రమత్తుఁడు, దిగంబరుఁ, డుగ్రగణావృతుం, డాపి శ
ల్యాళులకుం దేఁ డోకండు నిలయంబునకుం జనుదేర, సేయు శ్రీ
యాళోదు, పాపకర్ముఁడు సుతాలతకుఁ దక్కట! నిన్నుఁ జంపి
యాకాళికకు మాంసభోజనము గూర్పఁదలంచె నిదెట్టి ధర్మమో?

గీ అయ్యయో! వాఁడు నీపాలి యముఁడుగాని
తండ్రిగాఁడుర నీకు నోతనయవర్య!
కన్నబిడ్డలఁ జేసేతఁ గంఠములను
నరకువాఁ డెట్టి తండ్రియో యరయు మయ్య!

కుమారా! నీమేలుగోరి నీ కిప్పుడు హిత ముపదేశింపవచ్చితి. కావున నాయనా! "జీవన్ భద్రాణి-పశ్యతి" యనువాక్యము ననుసరించి యెక్కడికైనను పలాయితుఁడవై ప్రాణములఁ దక్కించుకొమ్ము. నీవా ముక్కుపచ్చలారని కుఱ్ఱవాఁడవు. ఒంటరిగాఁ బోవ నీకు భయమైన నా వెంట రమ్ము, మాయింటికిం గొనిపోయి నిన్నుఁ జక్కఁగాఁ బోషించుకొందును. నాకును బుత్రసంతానము లేదు గాన నొరులకై యిట్లాసపడుచుంటిని.

మతి—ఇదియా నాకు సంభవించిన దుఃఖము? భీరువైన యోవృక బ్రాహ్మణుఁడా! మీకుఁ బ్రాణములపై నెంతటియాస? ఇంత దనుక ధర్మాత్ముఁడయిన నా తండ్రిగారిని నిందించుచున్నను జరాభారంబున మతిపోయిన నీమాటల నే నంతగాఁ బాటింపను గాని యేశివభక్తుఁడో నాశరీర మపేక్షించెనఁట, నా తండ్రి యిచ్చుటకు సమ్మతించెనఁట, నే నిందులకు నన్యథాతలంతునా? సిరిరా మోకాలడ్డు మూర్ఖుఁ డెందయినఁ గలఁడా?

గీ. అన్యులకునై తినూ ధనవ్యయము సేయు
వంతయేటికి జననైకఫల మదియెగ
దర 'పరోపకారార్థ మిదంశరీర'
మనెడి పెద్దల నీతివాక్యములు వినవె?

భృంగి—ఓరి వెఱ్ఱి కుఱ్ఱా! హితంబుఁ దెల్పినను దెలిసికో లేకున్నాఁడవు. నీ కిది యేమిమూర్ఖత్వము? కుమారా! నిష్కారణముగా మృత్యుముఖ గుహాంతరమునఁ బ్రవేశింపఁ బోవుచున్నావే! నాయనా! నామాట వినుము. నీవు బ్రతికెదవు.

మతి—అయ్యా! మీ రిఁక నీపాటికి నూరకుండుఁడు. మీరుమాత్రము శాశ్వతముగా జీవించియుందురుగాని నాకు సెలవిండు.

రాగము: బేహాగ్ - తాళము: రూపకము.

భృంగి—వలదు నీకీ తులువతనము వచ్చిరాని-చదువులేల ॥వలదు

మతి—నాకులేని యిట్టిచింత నీకు నేల విగతశాంత ॥నాకు॥

భృంగి—కూర్మితోడ కూకలిడిన దుర్మతీ! యాలింపవేరా? ॥వలదు॥

మతి—ధర్మమార్గము తప్పి పాపుకర్మబోధ సేయఁ బాడియె ॥నాకు॥

భృంగి—బాగుపడెడు మాట వినరా పద్దులేరా।

మతి—బాగది యేదో యెంచవయ్యా బ్రాహ్మణోత్తమా!

భృంగి—బ్రతికియుండి సుఖము లందఁ బాసిర నీకు

మతి—వెతల కునికియైన పాడుబ్రతుకు రిత్తగా॥

భృంగి—ఏ-రా-రా రమ్మా॥

మతి—నే-రా-నూ-పొమ్మా॥

భృంగి—ఘోరమురా॥

మతి—సారమయా॥ నాకు॥ (నిష్క్రమించును.)

భృంగి ఆహా! మాదుర్బోధనలు వీనికడకుఁ బనికివచ్చునా? భళీ! ధీరోదాత్తుం డన నిట్లుండవలదా? వీనిమానసం బెవ్వరు చలింపఁ జేయుదురు? ఇంక నా ప్రయత్నము వ్యర్థమేకదా! వ్యర్థము కా కేమున్నది?

శా. క్రూరాగ్రేసరు లల్పవర్తను లధర్ముల్ గుంపుగాఁ జేరి స
ద్ధీరోదాత్తుల మోసగింపఁగఁ గువృత్తిం బన్ను పన్నాగముల్
తీరు న్వారలముందు నిష్ఫలములై దీపంబులన్ మిడ్తలగాఁ
జేరంబారెడు దోమ లెన్నిగతులన్ జీవంబులం బోయవో.

ఈ వృత్తాంత మాపరమేశ్వరుని కెఱింగింతు. పిమ్మట నాతం డెట్లు కార్యము సాధించునో చూచెద.

(నిష్క్రమించును.)

ఇది పంచమాంకము.



ఓమ్ శ్రీర్జయతు.

# బుద్ధిమతీవిలాసము



## షష్ఠాంకము

[సిరియాళుండును, బుద్ధిమతియు, యతియుఁ బ్రవేశించుచున్నారు]

యతి — ఏమి రాజా! నీ కుమారుఁ డింకను రాఁడుగా? ఇఁక మేము కాలాతిక్రమణమున కోర్వము.

సిరి — దేవా! ఇంకేమియు నాలస్యము లేదు.

గీ. ముద్దుగారెడు నాపుత్రుమోముఁ జూచు
వున్న మీనాఁటితో సరిపోవునయ్య
ఱేపు నీపాటి కమరపురీవిహార
లోలుఁడై యుండఁడే సిరియాళుకొడుకు?

యతి — మా కిప్పటికే భోజనకాల మతిక్రమించినది.

బుద్ధి — దేవా! శాంతింపుము.

భద్రు — (ప్రవేశించి) దేవా! యువరాజుగారు వచ్చుచున్నారు.

సిరి — హా! నా దౌర్భాగ్యము.

గీ. పాపకర్మంపు మృత్యువుబారి బడఁగ
వచ్చుచున్నాఁడు నా వంశవర్ధనుండు
భయదశాత్రవ వాహినీ భరితయుద్ధ
భూమి కేతెంచువీఁని పొలుపుతోడ
అక్కటా! పా[illegible]నకు [illegible]లిచి [illegible]రంతదుఃఖ మాపు
కొన్నను నింక నిప్పు[illegible] ధైర్యము [illegible]ట్టగలను?

మతిమంతుఁడు ప్రవేశింపుచుండఁ దలిదండ్రు లెదురుగా జని కౌఁగిలించికొని)

సిరి—హా! కుమారా! }
బుద్ధి—హా! తండ్రీ! } (మూర్ఛిల్లుదురు.)

మతి—అక్కటా! మీరు నన్నుఁ జూచి పెద్దపెట్టున నేడ్చుచున్నారు. మార్గమధ్యంబున బ్రాహ్మణుఁడు నాకుఁ దెల్పిన యుదంతంబు నిక్కువమై యుండనోవు. ఇం దెవ్వఁడో యొక మహాముని గాన్పించుచున్నాఁడు. ఈతఁడే కాఁబోలు నా శరీరమాంస మపేక్షింపవచ్చిన యతీశుండు. వీరి నడిగి విషయమును దెలిసికొనియెదగాక.

గీ. తాపసోత్తమ! నాతల్లిదండ్రు లేల
భూమిపై వ్రాలి రీరీతిఁ బొగులు చిపుడు
కొడుకు నగు నన్నుఁ జూచి వీ రడల నేల
కష్టములు నేఁడు మా కేమి గల్గెనయ్య?

యతి—(దుఃఖ మభినయింపుచు) రాకుమారా! నేఁడు నీకు నిజముగాఁ గష్టకాలమే ప్రాప్తించినది. నాయనా! జరిగిన వృత్తాంతమంతయు నెఱింగించెద నాకర్ణింపుము.

మతి—వినుచున్నాను.

యతి—మీ పట్టణంబం దున్న రొయొక దేవాలయంబున జపంబు సల్పుచున్న నన్నుఁ జూచి నీతండ్రి తా నేదియో వ్రత మాచరించుచుండెననియుఁ దద్వ్రతంబునకు భోక్తృరూపముగా రావలసిన దనియు నన్ను బలువిధంబులఁ బ్రార్థించె.

మతి—తరువాత.

యతి—అతనిదీనభాషముఁ గాంచి నే నందులకు సమ్మతించితిగాని నాకును నొక యపూర్వమైన శైవవ్రతనియతికలిమి దానికై నిన్నుపహారముగా సమర్పింపవలయు నని కోరితి.

మతి—దేవతాహార నిమిత్తమై స్వశరీరమైనఁ గోసి యీయవలసినదే. తరువాత.

మతి- ఆహా! వీరు నిర్గుణుండగు సాక్షాత్పరమాత్మను బోలుచున్నారు.
(ప్రకాశముగా) ఈ క్రూరకర్మ లందులకు సమ్మతించి కన్న
కుమారుని నీ కంఠచ్ఛేదనము గావింప సిద్ధులై యున్నారు.

మతి- మునీంద్రా! అర్థిజనుల యభీష్టంబులు నెఱవేర్చుట దాత
ధర్మము కదా!

యతి- (దుఃఖముతో) అయ్యో! బాలకా! నీవు వృద్ధిఁజెంది రాజ్య
భోగంబు లనుభవింపవలసినవాఁడవే. అట్టి నిన్నుఁ జంపనెంచిన
నీ తండ్రి యెంత కఠినకర్ముఁడో యోజింపుము.

వత్సా!

శా. మొక్కన్ బాదున నాటి నీరిడుచు రేపున్ మాపుఁబోషించి స
మ్యక్కాలంబునఁ బండ్లు పండుచుపయోగార్హంబుగా నుండఁగాఁ
జెక్కంజూచున గండ్రగొడ్డటను నా చెట్టున్ ధనాఢ్యుండు డి
ప్పక్కన్ బిడ్డలఁ జంప సిద్ధపడు నిష్పాపాత్ములన్ బోలుచున్,

మతి- దేవా! నిష్కారణముగఁ బుణ్యస్వరూపు లగు తల్లిదండ్రుల
నేల దూషించెదరు? వాగ్దానమును వీరు చెల్లింపవలయును
గదా! నా తండ్రి సత్యవ్రతమును గాపాడుటకుఁ గొడుకు నగు
నేను మరణంబున కొప్పుకొనుచున్నాఁడఁ గదా!

యతి- ఓరి వెఱ్ఱికుఱ్ఱా! నీ కిది యేమి పిచ్చి? నీవు లోకవృత్తులను
బాఁగా గుర్తెఱుంగకున్నావు. ఓరి మూఢుఁడా!

గీ. కఠిను లగు వీరు నిన్ నరుకంగవచ్చు
వ్రతనియతిఁ జేసి కుడువంగవచ్చు మాకు
చంపఁబడువాఁడ వీ వెట్లు సమ్మతింతు
వకట! బలవంతమగు చావునకుఁ గుమార?

మతి- మునీంద్ర! ఇందు నసందర్భవిషయ మే మున్నది? చూడుఁడు.

గీ. అనృతభాషణ దురితభయంబువలన
బాలు నన్ జంపి వీ రీయవచ్చు మీకు,
నైహికంబగు నీచసౌఖ్యంబు వదల
సమ్మతింపంగవచ్చు నీ చావు నాకు.

నిందుమాళికి సుహహారమిచ్చుకొఱకు
భద్రముగ భుక్తి సేయంగవచ్చు మీకు.

యతి—(స్వగతము) ఈ బాలుఁడు తలిదండ్రుల మించినాఁడు. ఇఁక నా యాటలు వీనికడ సాగిరావు.

మతి—(తలిదండ్రుల సమీపించి) అమ్మా! నాయనా! మీకు దుఃఖము శాంతించును. నా పలుకు లాకర్ణింపుఁడు.

బుద్ధి—(కుమారుఁ గౌఁగిలించుకొని)

సీ. హా! రాజవంశపయోరాశి హిమధామ!
హా! లోకమోహనాత్యంతరూప!

సిరి—హా! మదాజ్ఞాపాలనాచారసువితాన!
హా! నిరంకుశమనీషానిధాన!

బుద్ధి—హా! సర్వపారవిద్యామరందమిళింద!
హా! నిరంతర సమారాధితభవ!

సిరి—హా! పరాజిత సకలాంతరేంద్రియజాల!
హా! వీరశైవవ్రతావనాఢ్య!

బుద్ధి—గీ. హా! వినిశ్చల నిష్కల్మషాత్మశీల
హా! మదవ్యయకల్పవృక్షాలవాల!
హా! సుధీజనసుతసద్గుణా! సుపుత్ర!
హా! కుమారక! హా! తనయా! నయాఢ్య!

మతి—అమ్మా! నాయనా! నేఁ డిది యేమి విపరీతము?

బుద్ధి—నాయనా! నేఁడు విపరీతములే సంభవించినవి.

సి—(కుమారుఁ గౌఁగిలించుకొని)

శా. అన్నా! నిన్వధియించి యీ యతికి మాంసాహార మీనెంచి నే
నున్నా నిందుల కీ వొడంబడెదొ లేదో సందియం బందెదన్
నిన్నుం గన్న స్వతంత్రబుద్ధిఁ దనయా! నీయొప్పికో ల్లేక యీ
సన్నాహాం బొనరించు వీని నిపు డే చందాన శిక్షింతుదో?

మతి—తండ్రీ! మీ కిది యేమి వెఱ్ఱి? కడుపారఁగని నా కీసుమంతకష్ట
ము సంప్రాప్తమయిన దుఃఖించుచు సౌఖ్యం బొందవిన సంతసిం

చుచు గంటవత్తిడికొని నన్నింతవానిఁ బెంచి పెద్దఁజేసిన తల్లి
దండ్రులు మీరు నన్నేమి జేసిన౯ జేయరాదు? అయ్యో!
జనకా! జగదాధారుం డగు పరమేశ్వరున కాహారముగా విని
యోగింపక యీతుచ్ఛశరీరము నిల్పుకొందునా? పాపభూయిష్ఠం
బగు నా దేహం బిట్లప్రయత్నముగా బరమశివున కుపహార
ముగా సమకూర్పునంతటి మహాభాగ్యము నాకు లభించుట
నాపూర్వభవసంచిత సుకృతఫలంబునఁ గాక మఱియొండు
వలన నగునా? నే నిందులకు సమ్మతి తునో లేదో యని
మీరు సంశయించుట నన్ను మీ రంత దూషించినట్లు.

మఱియు —

శా. గాలిం బెట్టిన దీపసంస్థితిగతి౯ గాదంబినీనిర్గతి౯
నేల౯ రాల్పడగంగ్ల రూపముక్రియ౯, నిర్వారికాసార మీ
నాళి ప్రాణములట్ల, క్రొమ్మెఱుఁగునక౯ వ్యాలోలలీలాకృతి౯
రాలుం దేహము లెప్పుడో, నిలుకడ ల్ప్రాపించునే ప్రాణికి౯?
ఇట్టి శరీరంబులపై నిం కేటి యాస?

బుద్ధ — హా! తనయా! నీ కీ వైరాగ్య మెప్పుడు కుదిరెనోయీ?
తండ్రీ! నీయట్టి కలానిధినిఁ గోలుపోయిన వెనుక నీ దౌర్భాగ్యు
రాలికిఁక జీవనము గాఢాంధకారమువంటి దేకదా. నాయనా!
దైవ మెంత శీఘ్రముగా మాకు నీఋణానుబంధము తీర్చె
నోయీ? అక్కటా! ఆశలన్ని నీపయి నెలకొల్పి కడుగారా
బమునఁ బెంచినందులకుఁ తల్లిదండ్రుల మగు మే మిన్ని నీళ్ళ
చుక్కలకు నోచుకొనకపోయినను నిన్నుఁ జేతులార ఘాత
సేయవలసి వచ్చెనే యని దుఃఖించెదఁగాని తనయా! యతి
కాహార మీయవలసివచ్చెనే యని కాదు. కటకటా! మే మెట్టి
పుత్రఘాత కుల మైతిమోయీ?

మతి — అమ్మా! జ్ఞానహీనులగు నావంటివారికిఁ బదిమందికి బుద్ధి సెప్పఁ
దగిన నీవే యిట్లు దుఃఖించుచున్నా వేమి? తల్లీ!

చ. మనమునఁ దాల్మిఁ బోవిడిచి మాటికి నశ్రుజలంపుఁ గాలువ
ల్లనుగవనుండి జారఁ గొడుకా! యని యేడ్చెదవేల తల్లిరో!

తనువులు శాశ్వతంబులె? ముదంబులు నిల్చునె యెల్లకాల
మోజనని! తిరంబులే భువిని సంపదలుగా గొఱగాని బంధముల్?

సిరి.-మతిమంతా! నీవెంత దెల్పినను నాకు దుఃఖ మాగదుగదా! చూడు.

గీ. కులము రక్షించు సుతుని నిగ్గోలుపోయి
పాతకుఁడ నేను భూమిపై బ్రతుకఁగలనె?
కటకటా! సుతుని పాలిటి కాలమృత్యు
వైన వీనికి మృత్యు వేదైనఁ గలదె?

యతి—రాజా! నీ వేల దుఃఖించెదవుగాని నే బోయెదను లే. ఇంత దుఃఖకరమైన కార్యము నీవుమాత్ర మెట్లు చేయఁగలవు?

మతి—దేవా! నేను సిద్ధముగానే యున్నానుగదా! మీరు భోజనము చేసియే పోవచ్చును.

యతి—మతిమంతా! నీ విఁక నెన్ని చెప్పినను నేను వినను. "వీఁడేల వచ్చెరా" యని పైకి వినఁబడు నట్లనకపోయినను మనసున నూరక నన్ను దూషించుచు నీమీఁదిమోహము బాయఁజాలక యేడ్చుచున్న యిప్పాపాత్ములయింట భోజనముచేయ నాకర్మ మేమి కాలినది? సంతోషముతో నా కాహార మెవ్వరు సమకూర్తురో వారియింటికే పోయెదఁగాక.

మతి—అయ్యా! మీరు తీవరపడవలదు. కరుణామతిచేఁ గొంచెమాలోచింపుఁడు.

గీ. ఆయువులు లేక జచ్చెడి ప్రాణితతికి
నెల్ల దుఃఖంతు రిలఁ బ్రేమవీడ లేక
కొమరు కుత్తుకఁ జేసేతఁ గోయువారి
గర్భశోక మెన్నాళ్ళకుఁ గడచునయ్య?

యతి—అట్లయిన నే నిక్కడఁ గూరుచుండెద. ఇంక నొక్క యరగడియలో నీ తండ్రి నీకంఠము ఛేదింపవలయును. లేకున్న నేనోర్వను

మతి—తండ్రీ! మీ రిట్లు చింతిల్లుచుండిన నిమ్మహాత్ముఁ డూరకుండఁడు. సకల ధర్మవేత్తలగు మీకు నే నేమి విన్నవింపఁగలను? చూడుఁడు.

సీ. జన్మజరామృత్యు శార్దూల భయదంబు
దారాది సుతధన క్రూరసర్ప
చయముల సంతాపసంగత తమోభరితంబు
కఫవాత రోగదుష్కంటకంబు
కామాదివిషయ వృక్షవ్రాత బహుళంబు
ఘనదురాశా విహంగ సుయుతంబు
ఘోరపాప క్రూరచోర సంతానంబు
బహువిపత్కర్కశోపలపరీత

గీ. మట్టి సంసారకాంతారమందు జనులు
దారిఁగానక సత్కర్మ మారులగుచు
మరలఁ బుట్టుచుఁ బెరుగుచు మ్రగ్గుచుందు
రకట ! యీ సుఖమొక సుఖం బగునె తండ్రి !

జనకా ! అట్టి సారహీన సంసారదుఃఖంబు నాకు సంభ వింపక మునుపే పావనతమంబై, శాశ్వత సౌఖ్యాలవాలమై, నిత్యమంగళ ప్రదంబై, యేమహనీయ నిధానముగలదో యట్టి పరమపదంబును నేఁ జేరబోవుచున్నాను. మీ రిందులకు సంత సించుటకు మారుగా దుఃఖించుచున్నా రేమి? నీచ మగు నైహిక సౌఖ్యమే నిత్యం బని నమ్మి యెల్లకాలము మీకుమా రుండు బ్రతుకునని పేరాసచే నున్నారాయేమి? జననీ ! జనకా ! అట్టి యాశల వదలివేయుఁడు.

సారంగరాగము – ఏకతాళము

మతి— ఊఁటుడుమా యేకసైన అమ్మా ॥ఊఁ॥
దైవికములకుఁ జేయునదేమీ తలఁపఁగదే మదిని అమ్మా ॥త॥
నావిధియీగతి వ్రాసినచో నీవలనను నేమగునుఅమ్మా నీవల॥ఊ॥

బుద్ధి—ఏవిధి నే బ్రతుకుదురా తండ్రీ ! ఏవిధి॥
నేవిధమున నీవే జగమని నేభావించితిగదరా అయ్యో ॥భా॥
ఈ విపరీతపుఁజావు నీకే మని యావిధి వ్రాసెనురా తండ్రీ !
॥యావి॥ ఏవిధి॥

సిరి—మతిమంతా గుణవంతా॥ హా మతి॥
క్షితితలమున నెచ్చోటలేని యీ చేటేమిర నీకు ఈ॥ చేటే॥
కుతుకమునంతయుఁ గూలద్రోసెనే కొడుకా యీమానిని॥ హానా॥
కొతు॥ మతి॥

మతి—మానిని నేమనకయ్యా॥ అయ్యా॥ మా॥
పూనికమనలను పుణ్యులఁజేయఁగఁబూనిన వాఁడితఁడు॥ అయ్యా॥
॥పూని॥ మానితుఁడీ యనఘునిచే నేఁడు మన నియమముగడ
తేఱు॥ అయ్యా॥ మన మాని॥

యతి—ఔరా యీ పసికూన ఔ॥ రారా॥
ధీరశాంతుఁడీ ధీనిధిపలుకుల నూరుసుధారసము॥ ఆహా॥ ఊరు॥
ఘోరముజేయఁగ బాలుపడితినే కుటిలుఁడ నిర్దయుఁడ॥ నే॥
॥కుటి॥ ఔరా॥

సిరి—దిక్కెవరు నా కికను॥ కొడుకా॥ దిక్కె॥ [మాన॥
మక్కువసుతు నీ మరణమునకు నా మానసమెట్లోర్చు హానా
చెక్కున నీమెడఁదఱుగఁగ నాచే యెట్లాదునురాకొడుకా॥ చే॥ది॥

మతి—జాగొనరింపకుమయ్యా॥ అయ్యా॥
శ్రీగళు హారుని చిన్మయమూర్తిని చిత్తంబున నిలిపి॥ అయ్యా॥
॥చిత్త॥
రాగబంధముగోసి ఖరాసిని రాలువుమా నామెడను॥ అయ్యా॥
రాలు॥ జాగు॥

యతి—ఓరీ పాపిష్ఠా! నీవు నీసుతుని జంపివేయునంతలో నే నాఁకటిబా
ధచేఁ జచ్చులాగున నున్నదే? నీవందులకే జాగుచేయుచున్నావు.
దగ్గర నున్నారు గనుక నీకుమారునికై మీ యూరక నేడ్చెదరు
గాని నీయింట దిక్కుమాలినపక్షినై యున్ననన్నుఁ జూచి యెవ్వ
రేడ్చెదరు? మతిమంతా! నాకు నీ తల్లిదండ్రుల దుఃఖముతోఁ
బనిలేదు. నా కేదియో చెప్పి నన్ను బంపివేయరాదా? నీవు
కూడ నీచావునకు సందేహముగానొప్పికొనుచున్నట్లున్నాఁడవు.

మతి—దేవా! నా కింకెక్కడ సందేహము?

గీ. పాపసంసారదుఃఖంబు బాపునట్టి
స్వేచ్ఛామరణంబునకును సంశయము లేల ?
పాలుపైత్యం బటంచు నాభీలకాల
కూటమును ద్రావ నెవ్వాఁడు గోరునయ్యా ?
ఇదిగో నా తల్లిదండ్రులఁ ద్వరపెట్టి మీకు నాశరీరమాంస మిప్పించెదను.

యతి—అది నీ చేతగాదు.

మతి—అది యేమి ?

యతి—నీ తల్లిదండ్రులు నిన్నుఁ జేతులార వధింపలేకపోవుటవలన.

బుద్ధి—ఆర్యా! మేమందులకు సిద్ధులమైయున్నారము. (పతితో)నాథా! మతిశాంతునికై మన మింక జింతింపఁదగదు. మన మిఁకఁ బుత్ర మోహము దీసివేసికొనవలయును.

సిరి—దేవీ! నీ వాక్యములు యథార్థములే కాని చేతులార నిట్టి సుకుమారు నెట్లు ఘాతసేయుదు? (కుమారుఁ గౌఁగిలించుకొని హా! కుమారా! హా! వీరశైవ! హా! లోకమోహన సౌందర్య! హా! సుగుణరాశీ! హా! మదన్వయకల్పవృక్షాంకురా! నీ కెంతటి విపత్తు సంభవించెనురా ?

మతి—అయ్యో! తండ్రి! మీ కింకను ధైర్యము గలుగదే.

సీ. మితిమీఱి నాకయి వెతలొందనేల మీ
రించుకేనియు గణియింపవలదె ?
పాపకూపంబునఁ బడఁద్రోసియు నీ మోహ
పాశంబులను గట్టుపడుట మేలె ?
ఇల జన్మమొందిన నే ప్రాణియైనను
జిరకాల మిలనుండఁ జెల్లునయ్యా ?
ఎచట జన్మించిన దచట కేగుట దేహ
ధారికి నైజవర్తనము గాదె ?
గీ. తేపుగాకున్న మరి మాపో మృత్యు వెట్లో
సంభవించుట ప్రాణికి సహజముగద

స్థిరతలేనట్టి యీ నీచజీవి కిట్లు
తగునె దుఃఖింప నా తల్లి దండ్రులార!

సిరి—నాయనా! నేను దుఃఖమును విడిచిపెట్టినాఁడను గాని నీ యట్టి పరమభాగవతోత్తముని నిరపరాధిని వంశైకవిస్తారుని గుమారుని వధించిన యీ దుర్మార్గునికి జన్మజన్మంబులకు ఘోరనారకగతిగాక సద్గతి యెట్లు గలుగునోయీ! తండ్రీ!

మతి—తండ్రీ! మీరు కడు దప్పుఁదలంచుచున్నారు. చంపున దెవ్వఁడు! నీవుకావు నీ పీ కార్యమునకుఁ బరమేశ్వరునిచే నిమిత్తమాత్రముగా నియోగింపఁబడితివిగాని, తండ్రీ! సృష్టిస్థితిలయ హేతుభూతుండైన యా పరమపురుషుని యాజ్ఞలేని దెక్కడ నెట్టికార్యమును జరగనేరదని నీ వెఱుంగవే. జనకా! అదియుంగాక నన్నుఁ జంపుట వలనిపాప మెవ్వరికిఁ జుట్టుకొనవలయు? సర్వప్రాణి లోకైకరూప మనియు జంతుసంతానంబుల హృదయాంతరంబున వెలుగొందు నాత్మయొక్కటియే యనియుఁ దలంపక భూతదయాళుత్వము విసర్జించి, నీవు నే ననియెడి భేద మెవ్వాఁడు పాటించెనో యట్టి యీ యతీశ్వరునకు శిశుహత్యా పాతక మబ్బుఁగాక. నిరంతర ధర్మాచార పవిత్రత పరాయణులకు మీ కెట్టు లీ పాపము చుట్టుకొనఁగలదు? నియమిత శైవవ్రతంబు గాపాడికొనుచు సత్యవాక్యపరిపాలన శీలురై ప్రసిద్ధినొందుట చేత మీకును, గరుణాసముద్రుఁడగు రుద్రునకు నుపహారముగా శరీరమును గోసియిచ్చి నందులకు నాకును నిష్కంటకంబై, నిష్కల్మషమై, నిరామయమై, నిర్వ్యాజమై, నిర్బాధకమై, సజ్జనసంతానభరితంబై, యొప్పు నా కైలాసవాససౌఖ్యమే నిశ్చయము. ఇట్టి హింసకుఁ గారణభూతుండైన యీ యతీశ్వరున కిఁక నడుగవలసిన దేమున్నది? కాని అపారతపోధనప్రభావుండగు నిమ్మహానుభావుఁడు కరుణారహితుఁడై నాచావుఁ గోరుట కేదియో యొక మహాకారణ ముండకపోదు. ఈ తాపసోత్తముఁడు మనము ధర్మాచారహితులమై ప్రవర్తింపుచుంటిమా లేదో యనుంగొన నేతెంచిన పరశివావతారుండై నఁ

గావలయు; లేదా మాంసాహారప్రియత్వమున నేతెంచిన కుహ
నాకిరాతుఁడై నఁ గావలయు. ఈతఁడెవ్వండైననేమి? మాటఇచ్చి
నభంగి నా శరీరమాంస మీా యతికి నాహారముగా నియ్యవల
సినదే కావున మీామాంసమున సంశయంబంతయు విసర్జింపుడు.

సిరి—మతిమంతా! నాకే సందియము లేదు.

మతి—అమ్మా! నీకును సంశయ నివృత్తియైనదా?

బుద్ధి—నాయనా! నాకు లేదు సందేహము (యతింజూచి) మునీంద్రా!
వీని వధించుటయందు జరుగదగిన విధు లెట్లో సెలవిండు.

మతి—(స్వగతము) ఆహా! వీరిసాహసము కడుపార గన్నకుమారుని
జేతులార జంపసాహసించుచున్నారే! వీరినిశ్చలభక్తి యెంత
శ్లాఘనీయము? ఇఁక ముందు వీ రెట్లు మెలంగెదరో చూచెద
(ప్రకాశముగా) బుద్ధిమతీ! నీ విపుడు నీ కుమారుని

సీ. మలినంబు మాసిపో జలకంబులాడించి
తనువున మంచిగందం బలంది
వలిపెక్రొంబట్టు మేల్వలువలు గట్టించి
లలితభూషల మే నలంకరించి
వడుగు గావించి నీ కొడుకున కింపుగా
గడుపార నన్నంబు గుడువఁబెట్టి
చిత్తంబు కల్మషాయత్తంబు గాకుండ
యతనికి ధర్మపద్ధతులఁ గఱపి

గీ. వేగఁ గొనిరమ్ము వాని సంప్రీతితోడ
నాకనులముందు కంఠంబు నరుకవలయు
కలికి! నీ కొడు కిఁకఁ జావఁగలఁడు గాన
నిప్పుడే చెప్పుకొను మేమి చెప్పికొనెదొ.

సిరి—హా! ఇదెక్కడ ఘోరము! ఏమైనఁగాని హృదయమా! నీవు
దుఃఖమును వదలివేయుము.

బుద్ధి—మతిమంతా! రమ్ము. నీకు స్వర్గప్రయాణసన్నాహము లొన
రించి పంపెదను. నాయనా! నీ విట్టి మహాపదవి ననుభవింపఁ
బోవు తఱి నీకుఁ జక్కఁగా నభ్యంగన మాడించునంతటి యవ

కాశము నాకుఁగల్గినందులకు నే సంతసమున నే జెందుచున్నాను.
కుమారా! మతిమంతా!

సీ. ఇదియొకా తుదిసారి కుదురైన నీతల
 కేను మేల్సంపంగినూనె యంటు
టిదియొకా తుదిసారి మృదువులౌ నీకురుల్
 తిన్నఁగాఁ గొనగోటఁ జిక్కుదీయు
టిదియొకా తుదిసారి మదనాభసుశరీర!
 చెలువంపు నీమేన నలుగు వెట్టు
టిదియొకా దుదిసారి సదమల హృదయాబ్జ!
 నీకాయ నీ కురుల్ జిడ్డువిసువ

సీ. తేటమీఱెడు నీదు లలాటమందు
 బొల్పుగా మంచికస్తురి బొట్టువెట్టి
 స్వర్గమున ముక్తికన్య వివాహమాడ
 పెండ్లికొడుకును జేసి పంపెదను పుత్ర!

సిరి—హా! ఎంతకష్ట మెంతకష్టము?

బుద్ధి—తనయా! పోదమురమ్ము! (నిష్క్రమింతురు.)

యతి—ఓ నిర్భాగ్యపురాజా! నీవును నీ భార్య వెనువెంటబోయి యీ కొలఁది కాలమైన నీ పుత్రునిఁ గన్నారఁజూచుకొనుము. పాపము నీ దుర్గతికి నాకును దుఃఖము గలుగుచున్నది. అక్కటా! తేవు నీకీ కుమారుఁ డుండఁడుగదా! పుత్రవియోగదుఃఖము దుర్భరముగదా. నే నేమిసేయుదు! నా వ్రతమునకై నే నిట్లు చేయవలసివచ్చె. నాయదివట్టిజాలిగుండె కాబట్టి నీయీదుఃఖము జూచి సహింపఁజాలక పరలోకంబున కేగుచున్న నీ కొడుకును నేఁడైనఁ జూచికొమ్మని చెప్పుచుంటిని. తెలిసినదా?

సిరి—మునీంద్రా! యిం కెక్కడి పుత్రుఁడు? కన్నప్రాణంబులా గానఁ దల్లిదండ్రుల మగు మా కిరువురకు దుఃఖంబు విడువకున్నది గాని యెట్లయినను నే నన్నమాట చెల్లింపకపోను. కాని,

గీ. తనయు కుత్తుకగోసిన తక్షణంబె
 యతికులోత్తమ! మము తెగటార్పుమయ్య

అవని యీ పుత్రశోకదావానలమునఁ
బడి భరింపుచు నిఁక మేము బ్రతుకలేము.

యతి—ఏమీ! యిదియొక హత్యయా? చాలు చాలు. నీ వధిక ప్రసం
గము సేయరా దూరకుండుము. చూడుము. నీభార్య వచ్చు
చున్నదా? కాని సిరియాళా! నీ వెంత బుద్ధిహీనుండవు? నిష్కా
రణముగాఁ గన్నకుమారుఁ జంపుకొనుచున్నావు. పాపము!
నీవు నిక్కముగా నమాయికుఁడవు. వెఱ్ఱివాఁడా! నీ కుమారుఁ
జంపకుము. ఈ వ్రతముల కేమిలే. నే నిప్పటికైనఁ బోయెదను.
నే బిలువ లేదనుము.

సిరి—దేవా! ఇంతకు వచ్చినమీద నాకిం కేటికి దుఃఖము?

గీ. బాసజేసినవిధమున బాలుఁ జంపి
యిపుడె మీ కిష్టమగు భక్ష్య నీయదలఁచి
యుంటి నిఁక భక్తితోడ ముక్కంటి కెట్లొ
చేయిసూపించి మీరు భక్షింపవచ్చు.

[ప్రవేశము - భద్రుఁడు]

"అయ్యా! కుఱ్ఱవాని యుపనయనవిధులయందు జనకుఁడు
నిర్వర్తింపవలసినవి నిలిచియున్నవి కాన "నీవు సత్వరముపోయి
మహారాజుగారిం బిలిచికొనిరమ్ము" అని పురోహితు లాజ్ఞా
పించుచున్నారు.

సిరి—శాస్త్రవిధుల నతిక్రమణీయములుకదా. దేవా! నే నేగి కుఱ్ఱ
వాని దోడ్కొని వత్తును.

యతి—పొమ్ము. శీఘ్రింబుగ రమ్ము.

సిరి—(నిష్క్రమించును.)

యతి—ఈతని బొంకింప నాకుఁ గాదు, త్రిమూర్తులు త్రిలోకము
లేకమైవచ్చి ప్రయత్నించినను సాధ్యముకాదు.

[కుమారు నెత్తికొని సిరియాలుఁడు బుద్ధిమతితోఁ బ్రవేశించును]

సిరి—హా! తనయా! మతిమంతా!

చ. లలితమణీవిభూషల నలంకరణంబిటు నీశిఖామణిం
చలరుచుఁ జేయనైతిఁ దనయా! గళదస్త్రలతోడ నేఁడు నీ

విలయమహోత్సవంబున నవీనముగాఁ గయిసేసినాఁడ ని
ష్కలుషవు స్వర్గయాత్రకు సుఖంబునఁ బంపుటకా? కుమారకా!

బుద్ధి—సీ. దయ నోటియార పుత్రా! యంచుఁ బిలిచెడి
తుదిపిల్పు నీనాఁటితోడ సరియె?

సిరి—కొడుక! నీ ముద్దుపల్కుల విని యలరారు
భాగ్యంబు నేటితోఁ బాసిపోనె?

బుద్ధి—కన్నార నీరూపు గాంచుభాగ్యము నాకు
నేఁటితో దీరిపోనే కుమార!

సిరి—కడుప్రేముడిని నిన్ను గౌఁగిలించెడు భాగ్య
మీనాఁటితో సరిపోనె తనయ!

బుద్ధి—గీ. అయ్యయో! నాదుగతికి నేమందునయ్య

సిరి—భవమహాపాపకలిత మీభువిఁ ద్యజింపఁ
దండ్రికిఁ ద్వదీయ జీవముల్ధారవోసి
నాఁడు మన్నిడ! పోవుచున్నావె దివికి?

మతి—జనకా! మీరిఁక దుఃఖమును విడిచిపెట్టవలయును. ఇఁక నీశో
కముతో నేమి ప్రయోజనము?

బుద్ధి—నాథా! ఇఁక జరుగఁదగిన విధియేయ్యదియో యీ మహాత్ము
నడిగి తెలిసికొనుట మేలుగదా.

సిరి—నిజము. (యతిని సమీపించి) దేవా! మీ వ్రతపసువును నలంక
రించికొని వచ్చితిని. నవీనముగా బ్రహ్మత్వమును జెందిన యీ
మతిమంతునికి మీయాశీర్వచన మావశ్యము కావలసినదే
కదా. అయినను వీనికింకేమి శుభము?

ఆ. క్రొత్త వడుగు పెండ్లికొడుకైన యీ రాచ
చిరుత కింకఁ బెండ్లికొఱఁత దీర
దివి సుశీలలైన తెరగంటి కన్నియ
వలచి మెడను వేయు కలశమాల.

యతి—తథాస్తు.

బుద్ధి—మే మింతకంటె వీనికై యపేక్షింపవలసిన దేదియు లేదు. కాన మహాత్మా!

ఉ. చిన్నలతో నిటుల్ వణుగు సేసిన చేతడి యారకుండ సం
పన్నతనిర్ఝరుల్ కుసుమ వర్షములన్ గురిపింపఁ బెంపుమై
కిన్నర కామినుల్ రుచిరగీతలతోడ నివాళులియ నీ
వన్నెలకాని కిప్పుడు వివాహము సేయుదు ముక్తికన్యతోన్.

యతి—రాజా! నీకుమారు నెట్లు చంపవలయునో తెలిసితివా?

ఉ. బాలునిఁ జిన్నవాఁడు చనుబాలిడునట్టుల నంకపాళి నీ
రాలు ధరింప శంకర! శివా! పరమేశ! దయానిధీ! మహా
కాల! యటంచుఁ గ్రొత్తచురకత్తిఁ గుమారుని గొంతుగోసి భూ
పాల! తదీయమాంసమును బక్వ మొనర్చి పయోఘృతంబులన్.

భక్తితో నాహారమిందుము. ఇట్లు సేయుట కిష్టముండినఁ దత్కార్య మారంభింపుము; లేదా పొమ్మనుము. నీ విఁక గంట దడిపెట్టిన నే నోర్వను.

మతి—తండ్రీ! మునీంద్రునాజ్ఞ యెట్లో యట్లే జరుపుఁడు. మీరు నామీఁది ప్రేమానుబంధంబు గోసివేసికొని కరవాలంబు ధరించి నాకంఠము ఛేదింప సిద్ధముగ నుండుఁడు. మీకు దుఃఖమున కెందును నవకాశము కాన్పింపదు.

సిరి—నాయనా! నా కింకేటి దుఃఖము? ఎక్కడి ప్రేమానుబంధము?

చ. కలుషతనోగ్రమానసుఁడగాఁ దనయా! వినయాభిరామ సూ
క్తుల నను గారవించు ననుగుం గొడుకున్ నిను జంపఁ గన్నప్రే
ముడి యపుడున్ గటా! తుదకు భోరున నేడ్చుటకైన నోచ ని
ట్టుల యతికిన్ భయంపడి గుటుక్కున మ్రింగితి నాదుదుఃఖమున్.

హా! నే క్రూరకర్ముఁడగదా తనయా! కఠినహృదయుఁడ గదా తండ్రీ! నిన్నుఁ జేతులార ఘాతసేయుటకు ముందు నవ మన్మథ మన్మథుఁడవైన నీరుచికార మొక్కమాఱు కన్నారఁ గాంచుటకు నైన నవకాశ మిమ్ము. హా! మతిమంతా!

మ ఇది సంపూర్ణకళావిలాసయుతమై యింపొందునీమోము !

బుద్ధి— ...యి

య్యది కారుణ్యసుధారసోదిత నిరీక్షా కల్పవృక్షావళియా !

సిరి—ఇది మదాత్మజ్యకిరీటధారణ మహోత్కృష్టోత్తమాగంబ

బుద్ధి— .. హా !

మదనాకార!కుమార! నీ కీటుల సంప్రాప్తించెనే దుర్వ్యధల్.

మతి—తండ్రీ! మీరు నామాట వినరుగా?

సిరి—విన్నాఁడను నాయనా!

మ. సుతమోహప్రవిభిన్న మానసుఁడనై శోకించెదర్ గాక, యం
చితధర్మాకృతి వీవు దక్కుదువె దుశ్శీలుండనైనాకు ? నో
ప్రతిభాత్మా ! సమవేతసాగరమణీప్రాలంబకుంభద్విభా
న్వితభూరాజ్యపురంధ్రి చేరఁ జను నే నిర్భాగ్యదామోదరుల్.

మతి—అయ్యో! తల్లిదండ్రులారా! నావలనఁగదా మీ కిట్టి పుత్ర వియోగదుఃఖ మొదవినది? నేను మీకుఁజన్మింపకుండిన బాగుం డునే. అక్కటా! అట్లనరాదు. నేను మీపుత్రుఁడనౌటవల నంగదా పరమేశ్వరున కాహారముగ నాశరీరమిచ్చునంతటి మహాపదవి నాకు లభించినది. కాని అమ్మా! మీకుమాత్రము నే మహాపకార మొనర్చినవాఁడనే. నేను పూర్ణాయుష్మంతుఁడనై మీరాజ్యభారమువహించి మిమ్ము సుఖంపఁజేసెదనని నువ్విళులూరుచున్న మీకు నేను నిజముగా నాశాభంగము గావించినాఁడగదా! తల్లీ నీఋణం బే నెన్నిజన్మంబులకుఁ దీర్చు కోఁగలను?

సీ. పాపాత్ముఁడర్ నన్నుఁ బడయుట కీ వెన్ని
యుపవాసములబాధ లొందితమ్మ
జఠరుఁడ నీకడుపునఁ బడినప్పు డమ్మరో
యమితమోదమున మిన్నందితమ్మ
పటిచ నే భూమిపైఁ బడినవాదిగ నెంతొ
ప్రేమచే నన్నిఁవు పెంచితమ్మ

ఇటు సూదిమోపినంతటిబాధగలుగఁ బ్రి
పంచమే ముస్గిన ల్లించితమ్మ
గీ. కడకు మీ కిన్నినీళ్ళుచుక్కలను విడిచి
కులము రక్షింపఁగల నంచు కూర్మితోడ
నన్ను రక్షించితివి వేయిగన్ను లుంచి
అమ్మ! నీయూశ నేఁడు నిరాశయయ్యె.

తల్లీ! యిట్లేగదా లోకములోని మాతాపితలు తమసుతుల వలన సౌఖ్యములు గాంచుట

మ. తమపుత్రుల్ చిరకాలముణ్ బ్రతికి విద్యా సంపదావాప్తిచేఁ
దమ కేమో తలకెత్తిపోతు రని యత్యంతంబు లోలోన గొంతె
మకోర్కుల్ వచరించుకొంచు ననురక్తి బూనుటేకా, కయో
తమరో పుత్రులా ముందటంచుఁదలపోతల్ సేయురింతేనియుణ్.

కావున నింక మీ యాశ లేమి ప్రయోజనము?

సీ. తనయుండు గల్గలే దనుకొని వెతమాని
తల్లిరో! నీ వూరడిల్లవమ్మ
చిరకాలమయ్యె నేఁ జెల్లియంచుఁ దలంచి
తండ్రి! నిశ్చింతతో నుండుమయ్య
కొడుకు గాఁ డొకశత్రుకులజుఁ డం చని యెంచి
చురకత్తి నామెడ నరుకుమయ్య
నీవు తండ్రి వటంచు నేను పుత్రుఁడ నంచుఁ
బ్రేమానుబంధంబు వీకుమయ్య
గీ. నేఁడు మనసత్యనియతి కాపాడుమయ్య
ఈ యతీశు నభీష్ట మీడేర్పుమయ్య
లేఁడు మతిమంతుఁ డిఁక లేఁడు లేఁ డటంచు
హృన్నిరూఢని నాచింత నీగుమయ్య.

సిరి.—హా! దుర్భరము! దుర్భరము!

యతి—రాజా! ఏమిది నీ వూరక కాలయాపనము చేయుచున్నావు? (మతిమంతువైపునకుఁ దిరిగి) కుఱ్ఱా! నీకు మాట లెక్కువ

మూచున్నవి. నీవు చావసిద్ధముగా నున్నావా లేవా? ఏమి కదలవు! (అని లాగుచున్నాఁడు.)

బుద్ధి—అక్కటా! మునీంద్రా! పసివాని నట్లు పడలాగవలదు. వాఁడు సిద్ధముగానే యున్నాఁడు.

యతి—అట్లయిన తల్లిదండ్రులగు మీరిరువురే కాఁబోలు సందేహించు చున్నారు. మీ కెందుకీ దుఃఖము? నన్నుఁ బొమ్మనరాదే?

బుద్ధి—దేవా! అంత యెందులకు? నేను కుమారుని దగ్గరకుఁ దీసికొను చున్నాను (మతిమంతునిఁ బట్టుకొని) నాయనా! రమ్ము. నా తొడలపై బండుకొనుము(అంకపాళిఁ గుమారుఁ జేర్చుకొని)తండ్రీ నిన్ను చిన్ననాటనుండియుఁ గడుగారాబముగాఁ బెంచుచున్న నాహస్తములు నేఁడు నీమరణవిధికి నురికంబము అయ్యెఁగదా! కుమారా! యెంతటి హత్యకుఁ బాల్పడుచుంటిని! అమూల్య ముక్తామణీ వితానహారాలంకారరుచిరంబగు నీకంఠము నేఁడు నిశితకరవాలంబున కెరఁజేయుచుంటిమిగదోయీ! అయ్యో! నా కీ దుఃఖ మాఁగదుగదా!

యతి—రాజా! ఇప్పుడన్నియు సిద్ధములైనవి. మీ మువ్వురమనంబుల నేదైనఁ గళంక ముండిన నిప్పుడే చెప్పివేయుఁడు. తరువాత నా వ్రతము భంగమగును. నీభార్యాపుత్రుల విషయ మటుండనీ. ముందు నీమానసము పుత్త్రమోహాక్రాంతంబు గాకుండ నిశ్చలత్వంబుఁ బూనియుండెనా? చెప్పుము. పై కొకతీరు లో నొక తీరు నాకుఁ బనికిరాదు.

సిరి—మునీంద్రా! మీ రిన్ని తెఱంగుల నన్నడుగవలెనా! నా కెట్టి శంకయు లేదు. నామానసము కళంకరహితమై పుత్త్రమోహ విదూరమై ఘోరశిశుహింసాకరణ నిరూఢమై కరుణావిహీనమై కిరాతునిమానసము ననుకరించుచు నల్లరాతికంటె కాఠిన్యమును బూనియున్నది. ఇఁక నాకు దుఃఖములో నేమి ప్రయోజనము? పుత్త్రమరణానంతరముఁ బ్రాణత్యాగ మహోత్సవ మాచరించుకొని శివార్పితముగా నా దేహమును సమర్పించుటయే

నా కవశిష్టకార్యము. నా కింత కంటె నిం కేమిగలదు? యోచింపుఁడు. వయసా తీరె సౌఖ్యమా కడముట్టె. ఆశలా సమాప్తములయ్యె. కన్నకుమారుఁడా గతించె. ఇంకకు నా కేటి ప్రపంచ మెక్కఁడి సందేహము ?

యతి—అట్లయిన నీ కుమారున కేదైన శంక లుండెనేమో యడిగిచూడుము. అన్నిఁటికిం దెగించి కాటికి కాళ్ళుచాచుకొని యున్న నీ కింకేటి సౌఖ్యము? చిన్నవాఁడును వృద్ధిపొంది నీ రాజ్యాభారంబు వహించి యైహికసౌఖ్యము లెన్నియో యనుభవింప వలసిన నీకుమారుఁ డెట్లు తనచావునకు శంకింపకుండును? మాటాడించి చూడుము.

సిరి—అవశ్యము (కుమారునిసమీపించి)నాయనా! నేఁటితో నీమీఁది ప్రేమానుబంధమును విడిచిపెట్టినాను. ముని వ్రతహితార్థముగ నిప్పుడిచ్చట నిశితకరవాలంబున నీకంఠము ఛేదింపనున్నాఁడను కుమారా! (అని శంకించి) అయ్యో! ఇంకను మోహాతిశయమునఁ "కుమారా!"యని పిల్చుచున్నాఁడను. బాలకా! ఇప్పుడు నిన్ను నేను కొన్ని ప్రశ్నలడుగనున్నాఁడను, ప్రత్యుత్తర మిచ్చెదవా ?

మతి—తండ్రీ! సిద్ధముగా నున్నాఁడ.

సిరి—బాలకా! తండ్రీయని నన్నుఁ బిలువవలదు. నేను నీతండ్రినిగాను.

యతి—పాప మీబాలుం డింకెంతసేపు నిన్ను తండ్రీ! యని పిలుచును? వాసి కాయుష్కాలము తీరుచున్నదిగదా. ప్రాణముండిన నీక్షణకాలమైన తండ్రీ! యని పిల్చుమనోభీష్టము నీ కుమారునకును "కొడుకా" యని నోటియారఁ బిలుచుభాగ్యము నీకును గలుగుగాక.

సిరి—అబ్బాయీ! చెప్పుము.

సీ. లేదుగా మదిలోన లేశమైనఁ గుమార!
యిహలోక నీచసౌఖ్యేచ్ఛ నీకు

మతి—లేదు నామదిలోన లే దెట్టి దుర్వాంఛ
పరలోక గమనసుస్థిరతదక్క

బుద్ధి—తనయ! నిన్గన్నట్టి జనయిత్రిపైఁ బ్రేమ
దొలగి చిత్తంబు నిశ్చలతఁ గనెనె!

మతి—అమ్మరో! శివుని పాదాంబుజార్చన దక్క
పరచింతలన్నింటిఁ బాసినాఁడ

సిరి—కోరికేదైన నీ కున్నఁ గోరుమయ్య
కొడుక! నే దాని నిప్పుడే కూర్తునయ్య!

మతి—తల్లి! కలుషంబు లేదు నాయుల్లమందు
లేవు కోరికలొక్క నాచావుదక్క.

యతి—(స్వ) ఆహా! యీ బాలకుని మనోధైర్యము!

సిరి—మునీంద్రా! విన్నారుగదా యీ పసివాని కెట్టి శంకలు లేవఁట
ఇప్పుడు మీకు సందేహానివృత్తియైనదా?

యతి—రాజా! ఇఁక నీకార్య ముపక్రమింపవచ్చును. (స్వ) ఎంత
ఘాతుక కర్మం బనుష్ఠింపుచుంటిని?

సిరి—(కరవాలంబు ధరించి) హాదైవమా! నాదుష్ప్రాప్తికి నే నెంతని
నిలపింతును! కన్నకొడుకపై మోహంబు దీసివైతుగాక! కట
కటా! అజాతశత్రుండై సాధుజీవనుండై మనోవాక్కాయ
కర్మంబుల యందును గలుషమెట్టిదో యెఱుంగని యీ ప్రాణిని
హింసించు నంతటి ఘోరకిల్బిషంబునకు నే నెట్లు వెఱువకుందును?
అక్కటా! ఈనాఁటికి నే నెంతఘోరకిరాతుఁడనైతి! అయ్యో!
యిత్తాపసి తనవ్రతమునకై తానే వీని వధింపరాదా? కుమారుఁ
డని యించుకయైన సందేహింపక తన్మరణంబునకు సమ్మతించు
దునే. ఈ ఘోరమైన శిశుహత్యాపాతకము నాకంఠమునకే
చుట్టుకొనుచున్నది. శివశివా! ఈపాపకర్మముచే జన్మజన్మం
బులకు భవదురితంబులఁ గూడుచుచుఁ దుద కసహ్యాతరమగు
నీచనారకకూపంబునఁ బడుమని విధి నానొసట లిఖించెఁగాఁ
బోలు. దైవమా! నా కీపాప మెట్లు తప్పిపోవు? కటకటా?
యీపాపిని రక్షించు కరుణాళు లెవ్వరు లేరా?

సీ. అతిశాంతదాంతు నీ మతిమంతుఁ బ్రోవవే
కైలాసవాస ? రంగద్విలాస !
అకలుషాచారు నీ సుకుమారుఁ గావరే
పావనాకార దిక్పాలులారా !
అసమసుజ్ఞాని నిప్పసివాని నోమరే
సన్మార్గచర సూర్యచంద్రులార !
ఘను సద్గుణాఢ్యు నీ యనఘు రక్షింపరే
మహనీయ నవగ్రహములార !

గీ. ధన్యులారా ! సుపర్వమూర్ధన్యులార !
సిద్ధులార ! మహామతి ప్రసిద్ధులార !
మౌనులార ! యనూన సుజ్ఞానులార !
చేరి యీపసివాని రక్షింపరారె.

లోకపాలనరక్షకులై ప్రకాశించు నో లోకపాలురారా లోకోపకారపరాయణులగు సూర్యచంద్రులారా ? భూమ్యాకాశములార ! ఈ మానివ్రత హితార్థమును నాసత్యవ్రత రక్షణార్థమును చంద్రశేఖరదేవ పరితృప్తికిని నే నీ ప్రాణిని హింసింపఁబోవుచున్నాఁడను. యిందు నా తప్పేమియు లేదు. ఏతత్ప్రాణిహింసోద్యోగజనిత ఘోరపాతకమునకుఁ బాత్రుఁడఁ గాకుండ నన్ను రక్షింపుఁడు. మీరంద ఱిందులకు సాక్షీభూతులరై యుండుదురుగాక! (మతిమంతుని వైపు తిరిగి) మతిమంతా! నీ విఁక జంపఁబడుచున్నాఁడవు. ఓప్రాణీ ! నాలుక తుదిపై పావనతరంబై మోక్షఫలదాయకంబై పాపాంధకార ప్రభాకరమై ప్రకాశించు పంచాక్షరీమంత్రం బొక్కమారు జపము జేసి కొమ్ము. ఓబాలకా! నీ కదియె ముక్తికి మార్గము. (బుద్ధిమతి వైపుకుఁ దిరిగి) బుద్ధిమతీ! నీ కుమారుం జంపుచుంటినని నాపైఁ గసలకుసుమీ. ఓపతివ్రతా శిరోమణీ! విధి బలవత్తరమై నందున నీ కిట్టి పుత్రశోకంబు ప్రాప్తించినది. దీనికి నీ విఁక దుఃఖింపకుందువుగాక !

బుద్ధి — నాథా! నేనిది కుమారుని మరణవిధియని తలంపను తద్వివాహా మట్టులే నంతసించుచున్నాను. మీా రిఁక శీఘ్రముమునివరు నభీష్టం బొనఁగూర్పుఁడు.

సిరి—(ఖడ్గమునుజూచి) ఖడ్గమా! ఇకనీ ప్రయత్నమున నీ వుండుము. హృదయమా! దుఃఖమును వదలివేయుము. ఆహా! ఎంత తాళుకొనుచున్నను మనంబునకు ధైర్యము గూడకున్నది గదా! అక్కటా! ఇదెట్టి ప్రళయకాలము. దక్షిణహస్తమా! నీ వెంతటి దుష్కార్యమునకుఁ బాలుపడుచుంటివి.

ఉ. దానములందు, సత్కృతివిధానములందు, నగణ్యపుణ్యసం
ధానములందుఁ బూజ్యమవు దక్షిణహస్తమ! నెమ్మదిక్ సమా
ధానమె నీకు సజ్జనవితానసుతప్రతిభావిలాసు నా
సూను ననువ్రజం బడఁవుత్రుఁద్రుపుదుష్కృతముం గణింపఁగ.

అయ్యో ఖడ్గమా! భయంకరమృత్యుస్వరూపిణివై నా కుమారుపాలిటికి నీ వెక్కడదాపురించితివి? స్నేహవశంబున నీవును దక్షిణహస్తమునకు సహాయపడుచుంటివా! ఛీ! నీకు విశ్వాస మింతయైన లేదుగదా!

ఉ. సంగరరంగనిర్దళితశాత్రవరాజులనెత్తుటేర్ల న
భ్యంగనకేళి సల్పితివిగా యది చాలక ఖడ్గమా! దురా
శం గడు నీచవృత్తి నతిశాంతుని మా మతిమంతురక్త మా
సంగఁదలంచి తిట్లు తగునా యగునా యజమాను జంపఁగ.

నిష్కారణముగ జడస్వరూపమగు నీ ఖడ్గంబును దూషించిన నేమిప్రయోజనము? నా పురాకృతఫలం బనుభవింపక తీరదుగదా. బాలకా! నీ వికకంఠము జాపియుండుము (కత్తి నెత్తి శంకించి) హా! నే ఘోరపాపుఁడఁగదా. కన్నకొడుకు కుత్తుక నరక సాహసించితి. ఇంతఘోరహత్య యెందైనఁ గలదా? ఏమినాబుద్ధిహీనత! మఱల నజ్ఞానంబున మునుంగుచున్నాఁడను. సత్యనియతిని వీసి యనిత్యంబులగు సౌఖ్యములయం దాసచే మతిభ్రమత చెందుచున్నాఁడను. ఛీ! వీఁడు పుత్రుఁడైననేమి?

మఱియెవ్వఁడైననేమి? ఈ సమయంబునఁగరుణాకష్టఁడే? (కత్తి నెత్తి మరలనాపి) హా! మతిమంతా! ఏపాపము నెఱుఁగని నిన్ను నే నిట్లు నిష్కారణముగఁ జంపవలసివచ్చెనే! చిరునవ్వు మొలకలచే నలరారు నీ ముద్దుమోముఁ గాంచిన నెట్టిఘోర కిరాతునకునైన నినుఁ జంపమనసుపుట్టునా? తండ్రీ! అయ్యో! నేఁ డిట్టిఘోర మేల ప్రాప్తించె? దైవమా! మఱల నాకీదుఃఖ మేల మనంబునకుఁ దెచ్చితివి? ఎంత మనసునిల్పుకొన్నను యీపుత్రశోకవారిధి కదలి పొంగి యుబికి వేల నతిక్రమించు చున్నది. నే నేమిసేయుదు? ఛీ! ఇఁక నీయంతరింద్రియములకుఁ దగినబుద్ధి చెప్పెదగాక.

సీ. హృదయమా! నీవు నెమ్మదిఁ బూనియుండుమా
మతిమంతుఁ డింక నా సుతుఁడు గాఁడు
మోహమా! నాకు దురూహ కల్పింపకు
పొమ్మబిడ్డలఁగన్న పుణ్యులకడ
దుఃఖమా! ననుఁ బాసి దూరంబునం బొమ్ము
కఠినాత్ముఁడను నన్ను గలఁపలేవు
ఖడ్గమా! యింతటి కఱకు చాలినయదా?
కొడుకుకంఠముఁబట్టి కోయఁగలవె?
గీ. కొడుక! నీమీఁదియాసల విడచినాఁడ
లేదుమోహంబు, దయ లేదు. లేదుజాలి
కన్ను లికఁ మూయుమా ననుఁగన్న తండ్రి!
కత్తివేటున కిఁక నీదుకంఠ మిమ్ము.

(అని కత్తి నెత్తగా)

యతి—ఆఁ! ఆఁ! రాజానిలునిలుము. ఓయీ! నీ వెంతటిక్రూరకర్ముఁడ వోయీ. ఎంతటిదారుణకృత్యంబు సలుపుచుంటివోయీ? అక్కటా! వీనిముద్దుమోముఁ గాంచినఁ జేర నేతెంచుమృత్యు దేవతకునహిత మింతకరుణ జనింపఁగలదే. కన్నతండ్రివైన నీ కించుకయైన వీనిపై జాలిగలుగదా? అయ్యో! కిరాతుఁడా!

ఇట్టిసుకుమారునిఁ జంప నీచేతులాడునోయీ? ఛీ! వీనికి నీ వెక్కడతండ్రివి? ఘోరమృత్యుదేవతవుగాని. మూఢుఁడా! నీకుఁ జెప్పువారు లేరా? నీయీకుల శేఖరుండగు కుమారుఁడు పోయిన వెనుక నీయీసత్యవ్రతమును నేనును మరల వానిఁ బ్రతికింపఁగలమా? చెక్కు గీఱిన బాల్గారు చక్కనికొడుకును మెడఁగోయ నేతెంచితివిగదరా! ఔరా నీసాహసము! నీ వెక్కడనో కటికవానికి జన్మింపఁదగినవాఁడవుగాని రాజవగుటకుఁ దగుదువా? నీకావంతయైన బుద్ధిలేనట్లున్నదే? ఇప్పుడు నాకై కదా నీకుమారుని వధించుట, నేనే చెప్పుచున్నాఁడఁ గనుక నీ కిఁక నూరకుండుము నాకు భోజనమున కేమి? నే నిఁకఁ బోయెదను. నా మాటలు విని నీ కుమారుని రక్షించుకొమ్ము. బుద్ధిహీనుఁడా! ఎందఱైనను నీకుమారునకు సాటి రాగలరా? నన్నుఁ బొమ్మనుము. అందువలన నీ కీ శిశుహత్యా పాతక మంత దురితము లేదు, చెప్పుము. పొమ్మంటివా?

సిరి—మునీంద్రా! మీ రిఁక నాకడ్డము రావలదు. నామాటకు మఱి యొకభంగి యెప్పటికైన జరుగునా? వీఁడు కుమారుఁడైన నేమి? మరి యెవ్వఁడైననేమి? నాసత్యవ్రతముకన్న నెక్కుఁడా! పుత్రమోహమునకుఁ బాత్రుండనై విమలంబగు సత్యవ్రతదీక్ష వదలుకొందునా? దేవా! మీరు నా కిఁక వేఱుమాట చెప్ప వలదు. మీరు చక్కఁగా నాకుమారునిశరీర మారగించి చనుఁడు. ఇఁక నిచ్చటినుండి తొలఁగుఁడు.

యతి—(స్వ) అహో! ఇతఁడు పట్టినపట్టు విడుచువాఁడు కాఁడు. కాని ఇట్లనెద గాక! (ప్రకాశముగా) ఓయీ! అట్లైన నీలాటి ఘోర కర్మములు మేము కన్నారఁ గాంచలేము. కాన పాకశాల కేగి యం దీకార్యము జరిపి నాకు భిక్షనీయ నిక్కడికి రమ్ము.

సిరి—చిత్తము. (బుద్ధిమతితో.) దేవీ! పాకశాల కేగుదము రమ్ము. (బుద్ధిమతియు సిరియాళుఁడును పాతిమంతుఁడును నట్లు చేయఁ జూదురు)

యతి—ఆహా! ఎంతఘాతుక కార్య మాచరించితి? వీరి నెన్ని కడగండ్లఁ
బెట్టినను నాకు లోఁబడుట కల్లయాయెఁగదా! నేను నిజముగ
నాలోచనహీనుండనై యిట్టి యనుచితకార్యం బనుష్ఠించినాఁ
డను. ఇది యంతయు నారదునిమూలమునఁగదా. అతని ననవల
సిన దేమి? నేను విషయములను జక్కఁగాఁ జర్చింపవలదా?
(దిక్కులఁ జూచి) ఇదిగో బుద్ధిమతి నిజపతిపురస్కృతయై పక్వము
చేయఁబడిన కుమారుని శరీరామిషంబుతోఁ బ్రవేశించుచున్నది.
ఇప్పుడు నా కేమి చేయుటకుఁ దోఁచకున్నది. ఇంకను నా కీ
వృథాయాస మేల? అటుగాదు. నేనిప్పుడ ధైర్యము వహింప
రాదు. ప్రయత్న మాచరించుట సత్పురుషధర్మము గదా.

మ. అధముం డేపనినైన విఘ్న మగునం చారంభముం జేయఁ డీ
పృథివిన్ ! మధ్యముఁ డాదిఁ బూనినకుమన్ విఘ్నంబుగామానుఁ; న
త్యధికోత్సాహితఁ గార్యమెల్ల సఫలంబౌదాక విఘ్నంబు లె
వ్విధిబాధించిన మానఁ డుత్తముఁడె యుర్విన్ గార్యనిర్వాహియౌ.
కావున నిట్లాచరించెదఁగాక !

(ప్రవేశము – సిరియాళుండును, బుద్ధిమతియును)

సిరి—మునీంద్రా ! మాభిక్ష మీరిఁక నంగీకరింపుఁడు. ఇదిగో మీ రర్థిం
చిన వ్రతాన్నము.

యతి—బాగు సిరియాళా ! బాగు.

బుద్ధి—దేవా ! నేఁడు మేము నిజముగా ధన్యులమయితిమి. మీ వంటి
యుత్తమతపోధనులు మా వ్రతభోక్తగా లభించుట మా పూర్వ
భవసంచితపుణ్యావిశేషంబునఁగదా ! మునీంద్రా! నా కుమారుని
మారణవిధికిఁ దాము కారణులైతి రని నా కావంతైన మీపై
ననూయ లేదు. మీరు తృప్తిచెందిన మా కదియే మోక్షాధా
రము. భోజనకాల మతిక్రమింపఁ జేసినందులకు నన్ను క్షమింతురు
గాక.

యతి—సాధ్వీ ! నీవు నన్ను గడుభక్తిఁ గారవించితివి. నా వ్రతము
నేఁటికి సఫలంబైనది గాని.

గీ. పరులు భుజియింపకుండ నొక్కరుఁడె కుడువ
రాదుగద యాత్మకుక్షింభరత్వమునకుఁ
జూచుకొన కన్యులను బ్రేమఁ జూచు నేను
పక్తి కెవరైన లేక సాపడుట మేలె.

(రాజువంకఁ దిరిగి) ఓరాజా! నీవును వినుము. స్వోదరపోషణకుఁ జూచుకొను సప్పాపాత్ముని జన్మము కాల్పనా? ఒకరినిఁ దృప్తి జేసి తాను భుజించుట సత్పురుషధర్మము. అట్టిచో నియమితవ్రతహితులరై నాలుగువాసరములనుండియు ఘోరోపవాసముల సల్పుచుఁ దన్మూలమునఁ గడు డస్సియున్న మిమ్ము వదలివేసి నే నొక్కరుఁడ నీ పాడుపొట్ట నింపుకొనఁ జూతునా? పాపము మీరును నాకంటె బాధచేఁ గడుఁ గృశించితిరి. నీ భార్య మన యుభయులభోజనమైన వెనుక భుజించినను నీ వైన నా పక్తికి రమ్ము. నేఁడు క్రొవ్వుచే నలరారుచున్న నీ కుమారుని మాంసాహార మారగించునంతటి మహాసౌఖ్య మనుభవించెదముగాక.

సిరి — మునీంద్రా! ముందు మీ రారగింపుఁడు. మీ కిప్పటికే చాల పొద్దుపోయినది.

యతి — అటుగాదు. నా పక్తికి నీ వుండకున్న నే నెట్లు నీ భిక్ష నంగీకరింపుదును?

సిరి — అయ్యో! మేము నరమాంసభోజనమున కలవాటుపడిన వారము కాము. మ మ్మిందులకై వదలివేయుఁడు.

యతి — అది యెట్లు సరియగు? చూచిచూచి నా నియమము నేనే చెడగొట్టుకొందునా? నీకు నా తోడ భుజింప నిష్టము లేకుండినఁ బోనిమ్ము. నే నేగెదను.

సిరి — అయ్యో! ఇంతజరిగిన వెనుక మీ రిటు లభ్యంతరము చెప్పుట సరియా! యోజింపుఁడు. నరపలలము నే నెట్లు భుజింపఁ గలను? అందునఁ గడుపారఁ గన్నకొడుకు మాంసమే! ఓ దయామయా! మీకు నాపై నేల కరుణ కల్గదు?

యతి — మూర్ఖుఁడా! ఇందుకు సమ్మతింపనివాఁడవు నిష్కారణముగా ముద్దుగారు నీ కుమారు నేల చంపుకొంటివి? వ్రతసుఖములలో నొకటియైనఁ జెందకుండ రెంటికిం జెడిన రేవడవైతివే? ఏది యెట్లైనను నీవు నా పఙ్క్తి కుండకున్న నే నీ భిక్ష నంగీకరింపను.

బుద్ధి — నాథా! వ్రతభంగముగాకుండ యోజింపుఁడు. కార్యము మించివచ్చినది. మన మిప్పట్టున మునియాజ్ఞ మీఱరాదు.

సిరి — మునీంద్రా! మీ చిత్తవృత్తి ననుష్ఠించెదను. మీరు కోపింప వలదు. నాయట్టి పాపాత్ముఁ డేకార్య మాచరింపఁడు?

గీ. కన్నకొడుకును జంపిన కఠినుఁ డిలను
గ్రవ్యభోజనమును లెక్కగాఁ దలఁచునె
ఇల్లు మ్రింగెడువానికి నింటితలుపు
లప్పడంబులుగావె? సంయమివరేణ్య!

యతి — ఇప్పుడు మాకు బరమానందముగాని యీ మాట మొదటనే చెప్పిన నెంతబాగుండును. దీనికై యనవసరమైన యింతవాద ప్రతివాదములతోఁ గాలమెంత నడిపితివి? బుద్ధిహీనుఁడా! కాని యింకనైనఁ దొందరపడుము. ముందు నాచేత నాపోశన మిచ్చి నీ విటు గూర్చుండుము.

సిరి — (అట్లు చేయుచున్నాఁడు.)

యతి — (మాంసమును బరికించి చూచి సక్రోధుఁడై) ఓరీ! దురాచారా! కపటహృదయా! నన్నెంత పరిభవించితిరా? నీ వింత దనుక నక్కటక్కుల నభినయించి తుదకు నీవాచరించు కృత్రిమ మిదియా? నిజపుత్రమోహపాశబద్ధుఁడవై నా వ్రతము నేఁడు భంగముగావించితిరా? ఇట్టి దుర్మాంసము నా వ్రతమునకును నాకును ననుపయోగమే. ఇట్టి యవాచ్యపుభిక్ష గావింపకున్న నీ కేమి మునింగినది? "నా కిది యసాధ్యముగాన పొమ్ము" అని నాకుఁ దొల్తనే చెప్పిన సంతోషముగ మఱియొక చోటి కేగుదునే! ఛీ! రాజాధమా! నీకుఁ బాపపుణ్య వివక్షత బొత్తుగా లేనట్టున్నదే.

సిరి—దేవా! మరల నేమి మునిగినది.

యతి—ఓరీ! పాపిష్టా! లోకపావనుం డగు పరమేశ్వరున కుపహార మిచ్చుటకు "సర్వేంద్రియాణాం శిరః ప్రధానం" అను నార్యోక్తిచే నుత్తమాంగం బుండ దాని వదలివేసి నీచతరంబగు నధమాంగమా నైవేద్యంబుఁ గావింపవలసినది? దురాత్మా! నీ వా శిరం బెచ్చట దాఁచితివి? చెప్పుము. ఓరీ కన్నులకు గంతకట్టి నన్ను మోసగించెదవా? చచ్చిపోయిన కొడుకు ముఖం బెప్పుడయినఁ గన్నులారఁ జూచుకొనవచ్చునని దాచితివాయేమి?

బుద్ధి—దేవా! తీవరపడవలదు. ఉత్తమాంగ మాంసమును వేఱుగాఁ బక్వము గావించినాను పోయి దానిం గొనివచ్చెద.

యతి—పొమ్ము.

బుద్ధి—(పోయి మరల పక్వముగావింపఁబడిన మాంసాహారముతోఁ బ్రవేశించి) దేవా! దీనిఁ జిత్తగింపుడు.

యతి—(చూచి) బలే బుద్ధిమతి! బాగురాజా! మన మిఁక భుక్తిఁ గొందమా? (ఆలోచన నభినయించి) రాజా! నిలువుము నిలువుము మఱచితి.

సిరి—మరల నేమి ?

యతి—గీ. తోడు భుజియింపఁగాఁ గుఱ్ఱవాఁడు లేక
నాకుఁ జేయాడునే భోజనంబు సేయఁ
బ్రీతిపీడంగ లేనైతి బిడ్డలవయుఁ
బిలువఁ బంపుము బత్తిక్కిఁ బిల్లవాని.

సిరి—హా! హతవిధీ! నే నింకేమి సేయుదు. అయ్యో? నాదుఃఖమున కేనాటికి నంతములేకపోయెగదా! (యతివంకకుం దిరిగి.) దేవా! నే నిప్పు డెక్కడనుండి బాలునిఁ దోడ్కొనిరాఁగలను?

శా. ఏదిక్కుల్ బరకింతు బాలునకు నే నీయర్ధరాత్రింబునం
దే దోతెంచెడు వేళ గోగిరము లిట్లే చల్లనైపోవ? ది
క్కేదీ బిడ్డలు లేని వాఁడగద నే నేబాలు రమ్మందు న
య్యో యీదౌర్భాగ్యుఁడ నాకుగల్గునె సుతప్రోద్భూత సౌఖ్యోన్నతుల్.

యతి — ఛీ! అట్లైన సుతవిహీనులగు మీచేతి యన్నంబు నేభుజియింపను. ఓరీమూర్ఖా! నీ వింతవనుక నావిషయ మేల చెప్పకుంటివి? అక్కటా! నా కెంత యాశాభంగము గావించితిరా? చాలు చాలు! న న్నింతటితో వదలి వేయుము.

బుద్ధి — దేవ! సర్వసిద్ధమైన వ్రతాన్నము నేల విసర్జించెదరు; నామనవి కొంచె మాలింపుఁడు.

మ. యతిచూడామణి! నాకుఁ బుత్రుఁ డొకఁడే యాయొక్కనింగూడఁజం పితి మింకొక్కఁడు నాకు లేఁడుగద, పిల్పింపఁగ సుతుం డాటకుఁగ జతకాండ్రఁగ గుమికూడినాఁడొ చదువంగా నయ్యవారింటి కు న్నతిఁదా నేగెనొ యెట్లువచ్చు? మునిచంద్రా! స్వస్థుఁడై యుండఁగన్.

యతి — రాకున్న నే విందారగింపను. సుతసంతానహీనంబైన గృహంబు పాడుపడినయాతిథంగి నిష్ప్రయోజనముగదా! అయినను తల్లిదండ్రులగు మీ రిరువురును నెలుంగెత్తి వానిం బిలువుఁడు. ఎట్లు రాకుండునో చూతము. వచ్చిన యనంతరమే మనము భోజనము సేయుదము.

సిరి — మునీంద్రా! ఇది యెందైన సరియైన విషయమా! చచ్చి పోయిన కొడు కెట్లు మరల బ్రతికి రాఁగలఁడు?

యతి — మీ రిరువురు పిలువుఁడు. వచ్చునేమో చూతము.

సిరి — మీ మహిమవలన వాఁ డేమైన బ్రతికి వచ్చునేమో?

యతి — ఏమీ! ఇంకను నీ యాస. కాని పాపము, నీ యభీష్టమే నెఱ వేఱునేమో పిలువుము.

బుద్ధి — నాథా! వారి యాజ్ఞ చొప్పున నాచరింపుఁడు.

సిరి — సతీ! ఏల యీ యడియాసలు. అయినను పెద్దలవచనం బనతి క్రమణీయము గదా.

బుద్ధి — సీ. ఎందు బోయితివిరా సౌందర్యవిజిత

రమాకుమారక! రార మాకుమార!

సిరి— మునిహితార్థము ప్రాణములఁ బాసితివి గాన
మునిహితార్థమె జీవముల ధరింపు
బుద్ధి—నీ రూపుఁ గన్నార నేఁ జూడ కెటుబాయుఁ
గడలేని గర్భశోకంబు నాకు
సిరి— కైలాసవాససౌఖ్యముల కానందించి
మతిమంత! మఱచిపోయితివె నన్ను?

బుద్ధి—గీ. రార సుకుమార మన్మథాకార! శూర!
సిరి— రార బుధనుతసద్గుణస్ఫార! ధీర!
బుద్ధి— రార సురుచిరకీర్తివిస్తార! రార
సిరి— రార మతిమంత! గుణవంత! రార శాంత!

యతి—(మాయారూపమును వీడలి గౌరీసహితుఁడై మతిమంతు నెత్తు
కొని) జయతు జయతు సిరియాళ మహీపాల!

పార్వ—శుభప్రాప్తి రస్తు బుద్ధిమతీ సతీమణీ!

రాగము : వసంత – తాళము : రూపకము

సిరియాళ భూమిపాల నీ సుతుం జేకొనుము సుశీల॥
వరలోకదుర్లభప్రభావు పరమభావుని ॥సిరి॥
ననుబోలినట్టి ధీరుఁడు దుర్నయ విదూరుఁడు!
యనఘహృదయసారుఁడు యువికారుఁడు కుమారుఁడు ॥సిరి॥

ఉ. మేరుసమానధీర! కొనుమీ భవదీయకుమారు, సద్గుణ
స్ఫారు, సిరంతరాగమవిచారు, బరోపకృతిప్రధానచా
చారు, సురూపనిర్జిత వసంతజయంతకుమారమారు, సం
సారవిచారదూరు, విలసన్మతిమంతు, సమగ్రశాంతునిన్.

సిరి–బుద్ధి—ఆహా! ఏమి మాభాగ్యము! దేవా! దేవీ! నమస్కరించు
చున్నాము.

పర–పార్వ—అభీష్టసిద్ధిరస్తు.

(ప్రవేశము - నారదుఁడు)

మాలినీ వృత్తము.

నిరుపమగుణసంగా! నిర్జరారాతిభంగా!
గరుడవరతురంగా! కాలధారాధరాంగా!
ఉరుపదభవగంగా! యోగిహృత్పంజభృంగా!
సురుచిజితపతంగా! సుందరా! వెన్నదొంగా!

ఓహో! లోకపాలకుండగు శంకరుఁడును జగదంబ యగు పార్వతియునా! నమస్కారము.

పర-పార్వ—మనోవాంఛాఫలసిద్ధి రస్తు.

నార—సిరియాళా! మీమతిమంతునితో మీకందఱకు సేమమా?

సిరి—దేవా! లోకారాధ్యుఁడగు పరమేశ్వరుని కరుణ గల్గియుండ మాసేమమున కేమికొఱఁత ?

నార—నిజము. శంకరుం డఘటితఘటనామనీషిగదా. ఆ మహాత్మున కసాధ్యమేమున్నది? కరుణయనునది కొంచెముండినఁ జాలును. బలవంతముగఁ జంపినను మరల బ్రతికింపఁగలఁడు.

పర—ఆహా! ఈనారదుఁడు మ మ్మధిక్షేపించుచున్నాఁడు.

సిరి—పరమేశ్వరా! ఆకడ భిక్షుకై యతీశ్వరుఁడు తీవరపడుచుండ నోఁపుగావున నాకు సెలవొసంగినఁ బోయివత్తు.

పర—భూమీశా! నీ కిఁక దాచ బని లేదు.

సీ. పాఱులెందును గానబడకుండఁ జేసి ని
న్నలయించునట్టి కష్టాత్ముఁడే నే
అర్థిలోకాన్వేష ణార్థమైనీ వేగ
నతిథిగావచ్చిన యతిని నేనే
కపటనీచక్రియాకలితుఁడనై నిన్ను
పుత్రవ్యాన్నమడిగిన కఠినుఁడే నే
చురిపెము ల్గొల్పు నీముద్దుపట్టినిఁ బట్టి
గొంతుగోయించిన కుటిలుఁడే నే

గీ. మానవేశ్వర! కరుణావిహీనమతిని
పాపభీతి విసర్జించి పగఁదలంచి
వంచనల మానసగింపఁ దలంచి యోడి
నట్టి కైతవవృద్ధసంయమిని నేనె

సిరి—అహా! నాపూర్వభవపుణ్యపరిపాకఫలం బింతయుండు నే? సతీమణీ! మనమిపు డానందసాగరంబున నోలలాడుచున్నారము.

పర—రాజా! నీయుత్తమశీలంబునకును నీసత్యవ్రతనిరూఢికిఁ గడు మెచ్చితి. అహా! నీదైవభక్తి యెంత శ్లాఘనీయంబు!

మ. ధర సత్యవ్రతరక్షణార్థము, స్వపుత్రస్నేహవాత్సల్య సు
స్థిరనైసర్గిక మోహపాశములఁ గ్రేఁ ద్రెంచి నిష్కల్మష
స్థిరతం గన్నకుమారుఁ జంపితివి త్వాదృగ్ధర్మశీలక్రియా
పరుఁ డీ రేడు జగంబులం దొరకునే పల్మారు గాలించినన్.

మఱియు—

గీ. అవని గల్గునె యెవ్వానికైన నిట్టి
యనితరప్రాప్తసత్యవ్రతానురక్తి
మానితవ్యక్తిసుగుణసంప్రత్ప్రయుక్తి
దేవభక్తి నిరంకుశోద్వేలశక్తి

సిరి—దేవా! మానవమాత్రుండ నగు నన్ను మీ రింతిగా నగ్గింపవలయునా? మీమహిమాతిశయములఁ నెఱుంగ నెవ్వరితరంబు?

సీ. సకలదాసాఘ వాంఛాక్షేత్రములఁ బెంపఁ
దొలివృష్టి నీదయాకలితదృష్టి
భవపాపపైశాచబాధ లున్మూలింప
రాయ నీ పేరు దురాయివేరు
ఘనవిపజ్జలధిమగ్నజనాళిఁ గాపాడి
దరిఁజేర్చునావ నీచరణసేవ
ప్రపంచజనచిత్రపటము లాడింపంగ
మరశీల నీభూరిమహిమలీల

గీ. లేదుగదఁ జోడునీడ యూరేఁ లోక
ములకు నీజాడ యేగద పురవిదారి
భావభవహార! మాదృశపామరులును
పొగడఁ దగువారె నీచేతిపుణ్యవురుష.

పర—పతివ్రతామణి! బుద్ధిమతీ! నేను నీ మానసమును గడుకష్ట పరచితిగదా? నిరంతరపతిసేవాపరాయణవై సత్యవ్రతస్థిరవై చరించుటఁ జేసి నాయొనర్చిన యపకారమేమియు నిన్ను బాధించదు కాక.

బుద్ధి—దేవా! మాయట్టి మానవాంగనల యాచారంబులు మీరు శ్లాఘింపవలయునా! మీరు నాకొనర్చిన యపకారం బెద్ది? కరుణాంతరంగులరై మీ దివ్యరూపంబు మా కన్నులకుఁ గాన్పింపఁ జేసితిరి. ఇంక మా పుణ్యఫలం బెంతయై యుండు

నార—అమ్మా! పార్వతీ! ఏమట్లు మాట్లాడిన ట్లున్నావు. నీ వూరక చింతింపవలసిన పని లేదు. ఏలయన

ఆ. వె. తల్లి! నీదు ప్రతిన చెల్ల లే దని నీవు
చింతబూనకమ్మ స్వాంతమునను
నరయ నీవు పడిన పరిభవంబునఁ గొంత
పంచియిచ్చినావు పతికిఁగూడ.

కాని యిప్పటికైన నా పలుకులనమ్మకము గలిగినదా! చూడుము.

సీ. ఏసతీసుచరితవ్యానంబు నే నల్పి
కల్గించితిని నీకుఁ గర్ణతుష్టి
ఏపతివ్రతయశోవ్యాపకంబున మాసె
నల్పాంగనాళిగర్వాంధకార
మేసాధ్వినద్గుణవ్యాసంగమహిమంబు
గతజీవుఁడౌ సుతుబ్రతుకఁ జేసె
నేమేటి యిల్లాలినామాక్షరంబులు
మూఢాంగనలకెల్ల బుద్ధిసెప్పు

గీ. నట్టినిర్మలధర్మగుణానురతను
మానవతిగుణవతి, బుద్ధిమతిని, వేడ్కఁ
గనుగొనుము నేఁడు కన్నులకఱవుదీరఁ
కలహాభోజను పలుకులు కల్ల లేమొ ?

పార్వ—నారదా ! నీ పలుకులు నిక్కువంబులు. బుద్ధిమతీసతీ మహి మంబుపరీక్షింప నే నింతఁ జేసితిని. నా కిది పరిభవం బేలయగును? ఇప్పుడీ బుద్ధిమతి లోకంబునకు మహోపకారంబు గావించినది. మానవతులకు సమంచితమగు నీతి దెల్పఁదిగాన దాని నిప్పు డెల్లరకుఁ బ్రకటించెదను. ఓ పతివ్రతలారా ! సతీమణులారా ! మీ రీ నీతినిఁ బరిగ్రహింపుఁడు.

మ. పతియే దైవమటంచు నెమ్మదిని సంభావించి దుష్పాప సం
గతులం బోవక, నెల్ల కాలమును సత్కర్మక్రియానిష్ఠచే
పతిసేవాపరతంత్రులై, సుగుణసంపద్యుక్తలై, లోకసం
స్తుతులం గాంచుఁడు కాంతలార ! సుయశోధుర్యైక చింతారతిన్.

నార—మఱియు నో సాధ్వీమతల్లులారా ! మీరు గ్రహింపవలసిన యుత్తమనీతి మఱియొకటి గల దదియేమన - పరులయున్నతపదవి గని యోర్పు వహించుటయే. శాంతిక్షాంతి లేని జన్మము నిరర్థకముగదా.

గీ. జ్ఞానమును బాప బోగముసాని, ధర్మ
హాని, యత్యాశలకు రాజధాని, యోప
రానిపాతకసంధాని మానహాని
మానవలె మీర లీ యోర్వలేనితనము.

పార్వ—నారదా ! నీవు బాగుగా చెప్పినావు. బుద్ధిమతీ! నీవు వీరప తివ్రతవు. సూనృతవాగ్వైభవవు. అట్టినిన్ను బుత్రశోక మ నుభవింపఁజేసినందులకు నేను పాపాత్మురాలనే. అయ్యో ! గుణవంతుఁడగు నీమతిమంతు నెంతహింసపెట్టితిని !

బుద్ధి—అమ్మా ! లోకమాత వగు నీవిటులాడఁజెల్లునమ్మా ? నీసహా యమునఁగదా నేను శాశ్వతయశముఁ బడసితిని.

మతి—తల్లీ! నన్నుహింసపెట్టితిరని మీరాను [illegible] పవలను పరమపావనుండగు పరమేశ్వరున కాహారముగా నా శరీరము వ్రియపడుచు పుణ్యఫలంబు మీవలన గదా నాకుఁ గల్గినది. కాని పార్వతీ! పరమేశ్వరా! నావిన్నపమొక్కటి మీ రాలింపవలయు! ఏమని

గీ. హృదయమున నేను కల్మషవృత్తిమాని
నాశరీరము మీ కిచ్చినానొ లేదో
ఎట్టివిషయేచ్ఛలను మది బెట్టినానొ
ఐహికసుఖంబులకును బేరాసబుట్టె.

పర—ధర్మస్వరూపుండ వగు నీయందు దోషమొందవఁగలదా? చంద్రునకు శీతలభావం బేనాఁటికైన నశించునా? ఘోరకిరాతుఁడనై నిన్నారక బాధించినాను తండ్రీ!

గీ. కుసుమపేశల మగు నీదు కోమలాంగ
కముల, సుధలొల్కు నీపల్కుగముల నేను
కని వినియు నిన్ను జంపు మాచని కుమార!
పల్కుటకు మాయురే యిన్పనాల్క నాది.

నార—అమ్మా! పార్వతీ! నాయపరాధమొకటి మీరు మన్నింపవలయు. ఈ బుద్ధిమతీవిషయమును జర్చించుటలో మిమ్ము నే దూషించి యుందును. అదియుఁగాక యిప్పుడు,

శా. ప్రాలేయాచలకన్యయంతటి మహాప్రజ్ఞావతీ శ్రేష్ఠతో
దూలన్ బంతములాడిగెల్చి తని సంతోషంబునన్ బొంగియా
లీలన్ బల్కితి దేహముల్ మఱచి శూలీ నిన్నునాయిట్టి మూ
ఢాలాపంబుల లెక్కసేయకుము దుర్గా! యోగిరాడ్స్వర్గవీ!

పార్వ—నారదా! నీవు నన్ను దూషించిన దేమున్నది? ఉన్న వాస్తవమును వచించినావు. అయినను నీ కట్టి పాపభయంబున్నచోఁ దచ్ఛాపము శాంతించునుగాక.

పర—సిరియాళమహీపాలా! నీసత్యవ్రతంబువలన మాకుఁ బరమా నందము కల్గి నీకు వరమీా నుత్సహించితి చెప్పుము. నీ కేమి కోరికలు కలవు ?

సిరి—దేవా! నా కింకేమి కోరికలు కలవు. చూడుఁడు.

మ. కనుగొంటిన్ గనులార మిమ్ముఁ నిగమాకల్పున్ హిమాహార్యనం దనతోడన్; వ్రతముల్ ఫలించెఁ, గులవిస్తారుండు నాపుత్రుఁడున్ మనె యుష్మత్కరుణారసంబున, యశోమాన్యుండనైతిన్, శ్రితా వన! కోరందగు నెవ్వి నా కిఁక చునోవాంఛల్ జగత్కారణా!

అయినను దేవరప్రసన్నత నొందితిరిగాన నిట్లగుంగాక.

చ. సకలజగజ్జనావళులు సౌఖ్యసమృద్ధిశతాబ్దముల్ పరో పకృతినిరూఢచిత్తులయి భాసిలుచుందురుగాక పాప మూ రక నశియించి ధర్మము విరాజిలుగాత ప్రజావళిం దయా ప్రకటమతిన్ నృపాలురు శుభంకరులై నేలుతన్.

పర— తథాస్తు.

(అందఱు నిష్క్రమింతురు.)

గద్య

ఇది హారితసగోత్రపవిత్ర నృసింహామనీషవరపుత్ర బుధ జన విధేయ లక్ష్మీకాంతనామధేయ ప్రణీతం బైన బుద్ధిమతీవిలాసం బను నాటకము సర్వము సంపూర్ణము.



# లోభి

గ్రంధకర్త:

కీర్తిశేషులైన మహాకవి.

శ్రీ పానుగంటి విజయరాఘవరావుగారు

సకల గుణాభిరాముడు లోభి-వడ్డీలకోసం వేదకావ్యాలు సంపదకోసం సంఘసంస్కారాలు! అసలు ఫాయిదాల వసూలు కోసం ఆప్తకావ్యాలు - కనకంకోసం శునకచేష్టలు. వృద్ధ వివాహాలంటే ఉబలాటం స్త్రీవిద్యంటే చీదరింపు. పేదవాళ్ళంటే బెదిరింపూ, కన్నకొడుకంటే కొఱకొఱలు, కన్న బిడ్డలంటే కంటగింపు, ఆశ్రితులంటే యేవగింపూ, నౌకర్లని బెదిరింపూ, అందరిమీద అనుమానాస్త్రాలు, అతి తెలివి తేటలు అభియోగాలు అన్నీ మూర్తీభవించివున్న నాటకం లోభి. షోకేశాలంటే అతనికంటికి చవట పీనుగులు, సనాతన ధర్మం బుద్ధికి చవిటినేల, కరుణరసం అతనికి కంటికలికం. వితరణగుణం ఆతనికి ప్రబల విరోధి, అనుమానం అతనిసొమ్ము అబద్ధాలు అతనిఅస్త్రం. అసత్య ప్రమాణాలతని పంచ ప్రాణాలు. ఖర్చు అతనికి కంఠపాశం. విద్య అతనికి ఉరి త్రాడు. లోకం తనకుపకారం చెయ్యాలి. తను లోకానికి అపకారం చెయ్యాలి. అందుకే అతడు అవతరించాడు.

అద్భుత సంఘటనలతో, ఆదర్శ సన్నివేశాలతో ఆనంద రసాన్ని ఒలికించే సంభాషణలతో, చక్కని వ్యవహారిక భాషలో వ్రాయబడిన సాంఘికనాటకం. నాటక ప్రదర్శనాలకి సినీమా చిత్రనిర్మాణానికి అనుగుణ్యమైన నాటకరాజం. లోభి ప్రయత్నాలు ఫలప్రదమౌతాయో. తారుమారవుతాయో ఒక ప్రతి కొని వెంటనే చదవండి. పానుగంటివారి రచనాసమర్థత ఈ నాటకంలో కూడా ప్రతిభ గాంచించి. కొలది ప్రతులుమాత్రమే ఉన్నాయి.

వెల రు. 1—8—0

## మా స్వంత నాటక ప్రచురణలు.

### నాటకరాజములు

— ముత్తరాజు సుబ్బారావుగారి —

| | |
|---|---|
| శ్రీకృష్ణ తులాభారము | 1—8—0 |
| రణతిక్కన | 1—0—0 |
| కచదేవయాని | 1—0—0 |
| మార్కండేయ | 1—0—0 |

— సోమరాజు రామానుజరావుగారి —

| | |
|---|---|
| రంగూన్ రౌడి (పతిభక్తి) | 1—8—0 |
| గంగావతరణం | 1—8—0 |
| ధరణికోట (రెడ్లప్రతాపం) | 1—8—0 |
| భీష్మబ్రహ్మచారి | 1—4—0 |
| సతీ అనసూయ | 1—4—0 |
| సతీ సక్కుబాయి | 1—8—0 |
| కాలకేతనము | 1—0—0 |
| ఆలీబాబా 40 దొంగలు | 1—4—0 |

వలయువారిట్లు వ్రాయవలెను.

కురుకూరి సుబ్బారావు సన్.

ప్రొప్రయిటరు:

సరస్వతీ బుక్ డిపో, బెజవాడ.